# విషయ సూచిక

# మున్నుడి



**శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి & శ్రీమతి సుబ్బలక్ష్మి దంపతులు**

## జననము – బాల్యము :

ఈయన, గోదావరి తీరం ఆత్రేయ, భారద్వజ, గౌతమి నదుల సంగమ స్థానము, తూర్పు గోదావరి – ద్రాక్షారామానికి సుమారు 7 కి॥మీ దూరములో ఉన్న "మసకపల్లి" (మస్కరపల్లి) గ్రామంలో జన్మించినారు. దువ్వూరి పెదశేషయ్య, శేషమాంబ వీరి జననీ జనకులు.

## విద్యాభ్యాసము :

ప్రాథమిక విద్య స్వగ్రామములోను, మిగిలిన విద్యాభ్యాసము ద్రాక్షారామము, కొవ్వూరు, విజయనగరము మహారాజా కళాశాలయందు జరిగినది. "ఉభయ భాషా ప్రవీణ" ఆంధ్ర విశ్వవిద్యాలయము ద్వారా నందినారు. శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి, పేరి వెంకటశాస్త్రి, దువ్వూరి వెంకట రమణ శాస్త్రి గారులు వీరి గురువులు.

## ఉద్యోగపర్వము & సాహిత్యసేవ పర్వము :

❖ కాకినాడలో 1933–39 వరకు శ్రీమతి బాలాంత్రపు శేషమాంబ వారి మహిళా సంస్కృత పాఠశాలలో ప్రధాన ఉపాధ్యాయునిగా పనిచేసినారు.

- 1940-1946 సిబిఎన్ ప్రాధమిక బాలికోన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా పనిచేసినారు.

- 1947 సం॥లో "మల్లాది సత్యలింగ నాయకర్ ఛార్టీసు నందు" సీనియర్ తెలుగు పండితునిగా నియమితులై 1972 సం॥లో పదవీ విరమణ చేసినారు.

- "ఆంధ్రసాహిత్య పరిషత్తు" కాకినాడలో పుస్తక ప్రచురణ - ప్రచారములో సహకారమునందించిరి. "ఆంధ్ర సాహిత్య పరిషద్పత్రిక" ప్రచురణలో సహకరించినారు.

- ఈ కాలములోనే ""సూర్యరాయ ఆంధ్రనిఘంటువు 3,4,5,6,7 సంపుటముల నిర్మాణములో పాల్గొన్నారు.

- 7వ సంపుటము అనుబంధ శుద్ధ ప్రతిని శ్రీ ఆకెళ్ళ శేషాద్రి, సామవేదం శ్రీరామమూర్తి గార్లతో కలసి 1972లో పూర్తి చేసిరి. - ఆంధ్ర సాహిత్య పరిషత్తు సహాయ కార్యదర్శిగా కూడా పనిచేసినారు.

- 1966లో శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారి ఆధ్వర్యములో ప్రారంభించిన "శ్రీ వేణుగోపాల సంస్కృత ప్రచారసభకు" తమదైన సహాయ సహకారములు అందించిన పండితులలో వీరొకరు.

- కాకినాడ - జగన్నాధపురములో చాలాకాలము "మల్లాది వెంకట రామయ్యగారి" పేరిట జరిపించిన "సంస్కృతగోష్ఠి" కార్యక్రమాలను వీరు నిర్వహించినారు.

- 1966లో ఆంధ్ర విశ్వ విద్యాలయ భాషా ప్రవీణ ప్రవేశ పరీక్ష శిక్షణకు స్థాపించిన పాఠశాల నిర్వాహణలో వీరు తోడ్పాటు నందించిరి. తదనంతరము అది ""పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠముగా ప్రసిద్ధి నొందినది.

## సారస్వత రంగము :

ఈయన రచనలలో ఖండ కావ్యములు, చంపూ ప్రభంధములు, జీవిత చరిత్రలు, చిన్నకథలు, ఉపవాచకములు, శతకములు కలవు.

వీరి సాహిత్య విమర్శనావ్యాసములు ఆనాటి "కృష్ణాపత్రిక", "భారతి", "ప్రభుద్ధాంధ్ర", "హిందూసుందరి", "ఆంధ్రపత్రిక", "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక" మొ॥ వాటియందు ప్రచురించబడినవి.

## రచనలు, ఖండకావ్యము:

- ❖ **"హారతి"** (1937) (అలభ్యం)
- ❖ **"జీమూత వాహనుడు"** (1940) – 1941–46 వరకు బి.ఎ., ఇంటరు పాఠ్యముగా మద్రాసు, ఆంధ్ర, ఉత్కల విశ్వవిద్యాలయ ములలో
- ❖ **"జడభరతుడు"** (1950) – 1950–1955 వరకు బి.ఎ. పాఠ్యముగా ఆంధ్ర విశ్వవిద్యాలయములో
- ❖ **"అహల్య"** (1956) – 1957–1960 వరకు బి.ఎ. పాఠ్యముగా ఆంధ్ర విశ్వవిద్యాలయములో
- ❖ **"భక్త శబరి"** (1957) – 1968 – పి.యు.సి. పాఠ్యము ఉత్కల విశ్వవిద్యాలయము.

## చంపూ ప్రబంధములు : (నీలకంఠ దీక్షిత కవి సంస్కృత ప్రబంధములకు అనువాదములు)

- ❖ **"నీలకంఠ విజయము"** (1959)
- ❖ **"శివలీలార్ణవము"** (1968)

## జీవిత చరిత్రలు :

- ❖ **శ్రీమతి బాలాంత్రపు శేషమాంబ జీవితచరిత్ర** (1953)
- ❖ **శ్రీ వ్యాకరణాచార్య పేరి వెంకటశాస్త్రి జీవిత చరిత్ర** (1958)

**శతకములు :**

- "శ్రీ మల్లేశ్వర శతకము" (1930)
- "హనుమత్రింశతి" (సంస్కృతము) (1975)
- "దుర్గాశతి" (1975)

**ఇతర రచనలు :**

- "ఋతుచర్య" (1970)
- "ప్రబోధసుధ" (1972)
- "కుందమాల" (1978)
- "శతరుద్రీయము" (1980)

**ఉపవాచకములు :**

- ధన్యజీవులు, మణిమంజీరము, నాలుగు కథలు, మణిమాల, బుద్ధ బోధలు, మూడు నక్షత్రములు, భాస నాటక కథలు.

**తొలికథలు :**

- ధనమ్మ గుడి (1937 హిందూసుందరి)
- ఉడుకుమోతు (1937/9 హిందూసుందరి)
- రాదారి పడవ
- అగ్గిపెట్టెలవాడు



# బిరుదములు

శ్రీపాద కృష్ణమూర్తి మహాకవీంద్రుచే "రసవత్కవి" బిరుదు రక్తినంది
సీతానగర సభన్ చిరతరానందుచే "కవిశిరోమణి" యన్న ఘనతనంది
అల హసన్బాద్ సభయందు కోవిదులచే "పండితకవి" అన్న ప్రతిభనంది
వరజటావల్లభ పురుషోత్తములచేత "కవికోకిల" అటన్నఖ్యాతి నంది

ఆంధ్రవిశ్వవిద్యాలయార్హతలయందు
"ఉభయభాషాప్రవీణ"తనొందియుంట
జనని! నీకృపావేశసంసర్గకాదె
వందనములుగీర్వాణాంధ్రవాణి! నీకు





# బుద్ధుడు - కాపుపడతి

"అహింసా పరమో ధర్మః" అనే సూక్తి మీద ఆధారపడి ఒక కరుణారస పద్య ఖండిక-1936 ధాత నామ సం॥ ఆంధ్రపత్రికలో ప్రచురింపబడినది).



# బుద్ధుడు - కాపుపడతి

## దువ్వూరి సూర్యనారాయణ మూర్తి

(ముత్యాలసరములు)

(ఆంధ్ర పత్రిక - ధాతానామ సంవత్సరాది సంచిక - ముద్రితం)

ఉండె నొక గ్రామంబునందున
దండిగా ధనధాన్యములతో
నిండియుండిన కాపవారిది
గొప్ప యిల్లొకటి.

అన్నదమ్ములు, పిల్లపాపలు
ఆలుమగలుతో, అంత యిల్లూ
నిండి కలకల్లాడుచుండును
దోసపాదువలెన్.

ఒక్క దినమున పిల్లలందరు
తల్లిదగ్గర చేరిపలికిరి
అమ్మ! పండుగరోజు నేడూ
ఏమివండెదవే?

పండుగలలో ఇతరులెన్నో
పిండివంటలు చేసుకొందురు
నేడు మా కే పిండివంటలు
చేసిపెట్టెదవే?

**తల్లి**

బిడ్డలారా! పిండివంటకు
కోడి ఉన్నది కోసిపెట్టీ
కూరవండెద నింతకన్నా
పిండి వంటుందా?

ఇంతలోనే ఒకడు పోయీ
కోడిపెట్టను పట్టితెచ్చెను
కత్తిపీటను తెచ్చె నొక్కడు
కోడినే కోయన్.

కత్తిపీటను, కాపకాంతను
కళ్లచూచిన యంతలోనే
కంఠగతమై కోడిప్రాణము
కొట్టుకొనుచుండెన్.

**కోడి**

మీకు పండుగ నాకు మరణము
అన్నలారా! అక్కలారా!!
న్యాయమా? నాపిల్ల లిప్పుడు
ఏమి కావలెనో?

అమ్మ! నాహతమార్చి మీరూ
హాయిగా తినదలచియుండిరి
మీకు పండుగ నాకు మరణం
న్యాయమేనమ్మా?

నేడు నీపిల్లలకు పండుగ
నేడు నాపిల్లలకు ఎండుగ
తల్లి ఉన్నది నీదు పిల్లల
కేది నా కటులూ?

గర్భవాసము ఒక్కటేగద?
కన్నతల్లీ! నీది నాదీ
ప్రేమలో నీహెచ్చుతగ్గులు
పెట్టె నెవ్వాడో?

పండుగైతే నీదుబిడ్డకు
పిండివంటలు పెట్టుకొంటివి
చచ్చి నా పిల్లలకు నేనటు
జరుపుకోగలనా?

అక్కడక్కడ పడినగింజలు
మెక్కిప్రాణం నిలుపుకొను మా
కడుపులోపల పురులుగాదులు
కట్టుకున్నామా?

అన్నలారా!అక్కలారా!
పండుగైతే పర్వమైతే
ఉత్తరోజులకన్న అప్పుడు
కొత్తయేముందీ?

అనుచునుండగ నింతలో నా
వనిత రుసరుసలాడుకొంటూ
మాటలేవో పలికినంతనె
మనసు కరిగెడునా?

**కాపుపడతి**

మాటకన్నను మనసుమెత్తా?
మనసుకన్నను మాటమెత్తా?
మాటమనసులు ఏకమైతే
చంపకేపోదున్.

అనుచు కాళ్ళను తొక్కిపెట్టీ
చేత మెడనూ మెలిపితిప్పుచు
కంఠనాళము తెంపతలచీ
కాంత యుండగనూ.

**కోడి**

బతుకుటెప్పుడో చావుకొరకే
చావుకూడా బతుకుకొరకే
బతుకుచావులులేకయుండిన
లోకమెక్కడిదీ?

అనుచు గుడ్లను నీరుకక్కుకు
ప్రేమపాశము పెనగులాడగ
చావుగొంతుకతోడ అరచెను
కడుపు చెరువవగన్

కూతవినగనె కోడిపిల్లలు
అమ్మ కేదో బాధవచ్చెను
అమ్మకేదో కీడుమూడెను
అమ్మ యేదనుచూ,

**పిల్లలు**

అమ్మయేదే? అమ్మయేదే?
అమ్మఅక్కడ అమ్మయిక్కడ
అనుచు బెదరుచు తల్లియొద్దకు
పరుగు లెత్తినవీ.

**కోడి**

పిల్లలారా! తల్లులారా!
పాలబుగ్గల పాపలారా!
ఇంటపండుగ మీకు ఎండుగ
నాకు చావుసుడీ!

పాపమెరుగని పాపలారా
గడుసుతెలియని కన్నెలారా!
తల్లిలేనీ పిల్లలారా!
నాకు చా విపుడూ.

అనుచు బాధభరింపజాలక
కళ్ళుమూసీ బుద్ధదేవుని
ఆర్తరక్షాదక్ష! ఓ
బుద్ధా!! అనుచు తలచె.

కాపకాంతకు కళ్లకేదో
కమ్మినట్టులు తోచెనంతలో
ఎదుట నెవ్వరొ దివ్యతేజము
తోడ నిలబడిరీ.

**బుద్ధుడు**

అయ్యయో! తల్లీ!! వలదువల
దంతఘోరము; చంపబోకుము
ఆత్మవ త్సర్వాణిభూతా
న్యనిరి మనపెద్దల్.

చూడవమ్మా! దానిపిల్లలు
మేతమానీ యెట్టులున్నవొ?
తల్లిఅంటే రాతికైనా
తప్ప దాప్రేమా.

**కాపుపడతి**

ఎవరవోయీ? నీవు ఇక్కడి
కేలవచ్చితివోయ? ముందుగ
మెట్ట వేదాంతాలు చెప్పుట
కట్టిపెట్టోయీ!

**బుద్ధుడు**

అల్లిబిల్లికబుర్లుకా వో
తల్లి! మాహింస్యాత్తటంచును
కులముపెద్దలు చెప్పినారూ
కూడ దీ తల్లీ!!

**కాపుపడతి**

ఏమిమాటలు పలక నేర్చితి
వెంతకైనా తగుదువయ్యా!
జీవహింసకు అగ్రజాతులె
పుట్టినిల్లుగదా?

జీవహింసే కూడదంటూ
చెప్పిరంటివి; వారె మళ్లీ
జీవమే జీవులకు జీవన
మనిరి యిదియేమీ?

**బుద్ధుడు**

మతమువేరూ మనిషివేరూ
ఎందరెందరో? ఎన్నిమతములో?
చివర కెవరిష్టమ్ము వారలు
చెప్పినారమ్మా!

**కాపుపడతి**

కాయకూరలు, దుంప, ధాన్యము
న్యాయముగనా తినుట? దానిలో
జీవహింసే లేదటయ్యా?
చెప్పవేమయ్యా!

**బుద్ధుడు**

తల్లి! నిజమే; నీవు చెప్పిన
దల్ల హింసేకాని, దానిలో
ఎట్టిహింసను చేయకుండా
నిలవ నే లేమో?

అట్టిహింసను చేయవచ్చును
అందు జీవము బాధపడదూ
బాధపడినను కానుపించదు
మనిసికన్నులకున్.

**కాపుపడతి**

యజ్ఞములలో మేకపోతుల
నెంతొ బలవంతముగ చంపర?
నీ అహింసాసూత్ర మప్పుడు
నిద్దరోయిందా?

**బుద్ధుడు**

కటికగుండెల కర్మవాదుల
కపటవేదకుతంత్ర మయ్యది
దేవతలు పశుమాంస మిమ్మని
దేవురించేరా?

**కాపుపడతి**

కాలుకదిపిన, మాటలాడిన
కంటచూసిన, ఏమిచేసిన
మనిషిహింసను చేయకుండా
మసులుకోగలడా?

**బుద్ధుడు**

సృష్టినిలుచుట కేదియవనర
మట్టిపనిలో హింసకానము
కట్టిగుడుపును దారుణం బిది
కూడదేతల్లీ!

**కాపుపడతి**

ఎట్టిజాతికినైన హింసయె
పొట్టకోసం చేయతప్పదు
ఎన్నిచెప్పిన హింసముందూ
వెనక మనమయ్యా!

**బుద్ధుడు**

కాయకసరలు తిన్న నిండే
మాయపొట్టకు మాంసమెందుకు?
నిండుజీవము నిట్లు తిండికి
చెండగా నేలన్?

అనుచు కొలుకుల నీరుపెట్టుకు
కోడినెత్తుకు బోధ చేసెడి
బుద్ధభానుని జ్ఞానకిరణము
సోకె నాయమనూ.

అంతలోనే కాపుపడతికి
మాయకప్పెను, మనసువిరిగెను
బుద్ధదేవుని పుణ్యపాదం
పట్టి యిట్లనెనూ.

**కాపుపడతి**

కన్నతండ్రీ! కన్నుగానక
యెన్ని యిట్టివి చేసినానో?
నన్ను దరిజేర్చితివి నేటికి
తెలివి కలిగినదీ.

తల్లినిచ్చిన బుద్ధదేవుని
పదము పట్టిన విధముగా
కోడిపిల్లలు అతని కాళ్లను
చుట్టివేసినవీ.

జ్ఞానబుద్ధుడు మాయమయ్యెను
కాపకన్నెకు జ్ఞానమబ్బెను
చచ్చిబతికితి నంచు కోడియు
పిలల్లను కలసెన్.



# మహాత్ముని సుభాషితములు

ఏబోసిబాబు గర్జించినంతనె ముజ్జ
　　　గంబులు ఘూర్ణిల్లి గజగజమను
ఏపిచ్చితండ్రి కన్నెత్తిచూచిన యంత
　　　గుండెనీరై శత్రుకోటి కరఁగు
ఏబక్కినాన్న భాషించినంతనె మహా
　　　మహుల మానసము నర్మమతఁదాల్చు
ఏముదుసలి సత్ప్రవృత్తి వీక్షించిన
　　　యోగులెల్లరు నిరుద్యోగులౌదు,

రట్టి గాంధిమహాత్ముఁ డనన్యదుర్ల
భాతిశయిత మహామహిమాభిరాము
డతని ధార్మికతత్త్వ సూత్రాళినిపుడు
పద్దెములలో రచింతు సంబరముతీర॥

కత్తిపట్టుట చేతఁగానివాఁడయ్యును
　　　గదనరంగాగ్ర భీకరుఁడెవండు,
హింసపేరెత్త సహింపలేఁడయ్యును
　　　మొగ్గరంబున ధైర్యమూర్తి యెవఁడు
చిల్లిగవ్వయుఁగూడఁ జేతలేకున్నను
　　　గోటీశ్వరుండనఁ గూడునెవఁడు,
ఎదిరికన్నులకొక్క యెమ్ముల ప్రోవయ్యు
　　　ప్రబల మనోబల ప్రౌఢుఁడెవఁడు,

వాక్పటుత్వముచే సర్వవైరి జన కు
యుక్తుల నిరుక్తులుగఁ జేయుశక్తుఁడెవఁడు,
అట్టి గాంధిమహాత్ముని యద్భుతార్థ
భాసుర సుభాషితావళి ప్రస్తుతింతు ॥

పదమూడువత్సరాల్ ప్రాయంబునందుండి
తనకు సత్యమె క్రీతదాసిగాఁగ
కాసంతజ్ఞానంబు కలిగినప్పటినుండి
తనకు సత్పితృభక్తి ధాత్రిగాఁగ
చదువుసంధ్యలనేర్చి పొదలినప్పటినుండి
తనకు స్వాతంత్ర్యేచ్ఛ దాదిగాఁగ
ఘనకార్యము లొనర్చు కాలమ్మునందుండి
తనకు దైవబలంబె తల్లిగాఁగ,
పెరిగినమహాత్ముఁడీ గుణాకరుఁడు పరుఁడు
దిగ్దిగంత విశ్రాంత సందీప్తకీర్తి
అట్టి గాంధిమహాత్ముని యద్భుతార్థ
భాసుర సుభాషితావళి బ్రస్తుతింతు ॥

**అహింస**

దారుణ ప్రతిహింసకుఁ దావులేని
త్యాగపద్ధతిపైన నాధారపడుచు
దేశగౌరవమెల్ల సాధించినిలిపి
తెలివిగనుఁడయ్య యో భారతీయులార ॥

నీతియుతమగు మానవజాతినెల్ల
మృత్యుముఖముననుండి తప్పింపఁగలది
కదనహింసా ప్రయోగ మొక్కటియెయనెడి
తెలివగనుఁడయ్య యో భారతీయులార ॥

హింసకున్ బ్రతిహింస గావించినపుడు
మానవునిగొప్ప యందేమి గానఁబడదు
హింసకు బ్రతిహింస రచింపనందు
వలననే మన యత్తమత్వంబు నెగడు ॥

ప్రథితభౌతిక శాస్త్రప్రవక్తలెల్ల
రరసికనుగొన్న యట్టి లోహములలోన
దేనికి నహింసకున్నంత దిటవులేదు
కులగిరులకైన నాపాటి కుదురులేదు॥

ఈ యహింసయన్న నెంతెంతొ మెల్లఁగా
నెదుగునట్టి మొక్కయే నిజమ్ము
దాని యెదుగుఁదలయుఁ గానరానిదెయౌను
గాని యాగదెపుడు దానివృద్ధి॥

పశుధర్మమగు హింస పరమహీనమ్ము
నీచాతినీచమై నెగడు వర్తనము
అట్టి నీచపువృత్తి యందెకోట్లాది
జనుల శిక్షితులను సలుప వీల్గలుగ,

ఉత్తమ మానవ యుక్తధర్మమయి
విద్యలలో మహావిద్యనాఁ బరగి
సాగెడియీ యహింసాధర్మమందు
నెంతవీల్గలదొ శిక్షింప మానవుల॥

**కాంగ్రెసు**

ధర్మసమ్మత శాంతిపద్ధతులపైన
భారతీయ స్వాతంత్ర్య సంపాదనమ్మె
పరమలక్ష్యము కాంగ్రెసు భావమందు
తెలిసివర్తింపుడో భారతీయులార ॥

సత్యజీవిక కుత్తమ పరణిసూపి
రక్తపాతమ్మునందుఁ జోఁటంగనీక
ఉత్తమోత్తమ సంస్కారమొంది నట్టి
జనులఁ గాపాడుఁగాంగ్రెసు సంస్థయొకటె ॥

నిష్ఠురాస్పృశ్యతా నిర్మూలనమ్ము
ఖద్దరునిర్మాణ కార్యక్రమంబు
ధరనహింసాసత్య ధర్మవ్రతంబు
పరదాస్య నిర్బంధ బంధమోచనము,

హిందూ మహమ్మదీయేతర సఖ్య
ములు పునాదులుగాఁగఁ బుట్టదిట్టముగ
స్వారాజ్యసౌధమ్ము చక్కగట్టుటయె
కాంగ్రె సాదర్శంబు గ్రహియింపరయ్య ॥

దారిద్ర్యమును నజ్ఞతయు ననారోగ్య
మును పరాధీనత యనెడి యీనాల్గు
చలమూని భరతదేశమునెల్ల బీల్చి
పిప్పిచేయుచునున్న పెనుభూతములగు
కనిపట్టివాని మారణము సల్పుటయె
కాంగ్రె సాశయమని గ్రహియింపరయ్య ॥

కాన నంతఃకరణశుద్ధిగలిగి, స్వార్థ
పరత విడనాడి యవినీతిపాలుగాక
తతదయాసత్య శౌచ పద్ధతులనంటి
యుండుటే కాంగ్రెసీయులకు త్తమంబు ॥

కానినా డీ మహాకాంగ్రెసుసంస్థ
కమరిన పావిత్ర్యమడుగంటి తీరు
ఉత్తమత్వ కిరీటమున్నట్టివారె
ధర్మరక్షణసేయ దక్షులుగారె ॥

పదవులను గీఁచులాట సంబరములకయి
యీపవిత్ర కాంగ్రెసు సంస్థ లెంతదనుక
రంగభూములవలెనుండు అవ్వపడుచు
నంతవఱ కుత్తముఁడును సమర్థుఁడైన
వాఁడు దొరుకఁడు కార్యనిర్వాహకుఁడుగ ॥

కొందరందుఁ బ్రజాసేవకుల మటంచు
జనుల మోసానముంచి ప్రజాధనమ్ము
దూబరాఖర్చు చేయుచుఁ దుదకుదార
లుభయ పక్షకలంకులై యొప్పుచుండ్రి ॥

రాజకీయాలతోఁబాటు తేజమలర
సాంఘికపు నైతికపువృద్ధి సలుపుకొఱకు
కృషియొనర్చుటయే ముఖ్యకృత్యముగను
నునునదీ యసహాయోద్యమంపు తెఱువు ॥

**ఖద్దరు**

అధికదారిద్ర్య పీడితులైన భార
తీయులకుఁ గూడుగుడ్డల నీయఁగలది
రాట్టమేసుఁడి సాధనరాజమెన్న
దీనినుద్ధరింపుఁడు భారతీయులార ॥

కడఁక వడికిననూలు, మగ్గములపైన
సాటి భారతసోదర జనుఁడునేయ
దీక్షతో దానిని ధరించి దీనజనుల
కెల్ల వృత్తినిగల్పింపఁ జెల్లుమనకు ॥

ఈయుగమ్మున నీసాధువృత్తి యొకటె
సారధర్మము భారతజాతికెల్ల
భుక్తి కే గాక ముక్తికి న్బూర్ణమైన
సాధనముగాఁ దలంపుఁడో సాదులార ॥

## గోరక్షణ, పోషణ

పరమాత్ముఁడను భిషగర్వుఁ డాదరమున
భారతశిశువు లేపాటివర్ధిల్ల
రుచు లరువదియారు పచనమ్మొనర్చి
అమృతపానీయమన్, ఆవుపాలొసఁగె,
భారతదేశంపు వ్యవసాయవృత్తి
భారంబు పశువులపై నిల్చియుంట
పౌరి పశుపోష గోపోషణమ్ములును
భారతజాతికిఁ బరమ ముఖ్యములు॥

## బ్రాహ్మణత్వము

ధరణి నజ్ఞానమేను శూద్రత్వమనఁగ
అమిత సుజ్ఞానమేను బ్రహ్మత్వమనఁగ
ఎవఁడు పరబాధలెరుఁగు వైష్ణవుఁడతండె
బ్రహ్మనెరుఁగక కాఁబోఁడు బ్రాహ్మణుండు ॥

## బ్రహ్మచర్యము

ఎవ్వఁ డింద్రియసుఖ మపేక్షించి, దేహ
పోషకంబైనయట్టి యమూల్య వీర్య
మును వృధాపుచ్చునాతఁడు మూఢమతి, వి
వేకహీనుఁ డటంచు భావింతునేను ॥

సారతరమగు నీబ్రహ్మచర్యమునకు
ఆద్యవృత్తి మనోనిగ్రహమ్ము సుమ్ము
వీర్య సంస్తంభనాదు లావెనుక నెఱపఁ
దగినసాధనములని నాదగు మతంబు॥

## వివాహము

అపరిచిత నూతనాత్మల కైక్యమే, వి
వాహమునఁజెల్లు, నీధృఢబంధనమ్ము
తెగనిదందలి యొకరు గతించినంత
దైవసమ్మతమైన పద్ధతియు నిదియె॥

కాన వైవాహికమ్మనఁగా నెరుంగ
లేని లేతపిల్లలకుఁ దల్లియును దండ్రి
పొనరుచు వివాహమన్నది బొంకుగాని
సత్యసమ్మతమగు పెండ్లి సరణికాదు॥

భార్య సంసారయాత్రలో భర్తవంటి
వరలు సహచారిణియు ధర్మపత్నిగాని
ఇంద్రియసుఖమ్ము లంద నిర్మింపఁబడిన
రహినిబుట్టించు తంత్ర యంత్రంబుగాదు॥

## వైధవ్యము

బాలికలకు నిర్భంధవివాహ వశత
దాపురించిన వైధవ్య దశయుఁగూడ
కనిన నిర్భంధమే యగుఁగాన నట్టి
సతులకుఁ బునర్వివాహమ్ము సలుపుటొప్పు॥

## సంతానము

సంతతింబడయుటయన్న సతిపతులకు
సహజధర్మమెయగుఁగాని సత్యమరయ,
మితియుమేరయులేక నిర్మించుటద్ది
సరగ బహిరంగమౌ వ్యభిచారమగును ॥

## మౌనము

మానసిక శక్తులెల్లను
మౌనముచే వృద్ధినందు, మౌన మ్మంత
ర్వాణిని వినంగఁజేయును
గానందానిని వశంబు గావింపఁదగున్॥

## శరీర పోషణము

చెమటయూడ్చి తెచ్చిన భోజనమునె నిత్య
మనుభవింపుము తృప్తిగా హాయినిచ్చు,
ఆకలికినయి భుజియింపు మంతెగాని
భోగమునకయి మెక్కంగఁ బోకుమెపుడు॥

నీ మనశ్శక్తికిన్ మించి నెఱపునట్టి
నీదు స్థితిగతులకుమించి నెరపునట్టి
వ్యయము దొంగతనమ్ముతో నగును సమము,
ఆయమునుమించు ఖర్చు చేయంగఁబోకు ॥

## అధికార పదవులు

గౌరవోద్యోగావ కాశకల్పనము
భువిప్రజాసేవ సల్పుటకే గదయ్య
అట్టివి మన శాశ్వతాధికారముల
స్థిర రాజ్యములుగావు చిరకాలమేల॥

అదనుతోనెట్టి యధికార పదవినైన
నీవది స్వలాభవృత్తిని నెరపఁబోక
తివిరి యత్మార్పణంపు బుద్ధినివహించి
నిర్వహింపుచుఁ బొమ్ము దుర్నీతిదక్కి ॥

## మతము

అండపిండ బ్రహ్మాండమ్ము నిండునియతి
రూఢినొకనామమున కొక్క రూపమునకు
నంటఁగట్టుట మూర్ఖమతాంతరమ్ము
నీమనశ్శుద్ధి చేయునదే మతమ్ము॥

## అస్పృశ్యత

సాటి హిందువుల్ గాని క్రైస్తవమహమ్మ
దీయులనుగూడి మనమెట్లు తిరుగుచుంటి
మో; యటులె స్వమతస్థులైయున్న యంట
రాని సోదరులనుజూడ నర్హమగును॥

ధర్మబద్ధమ్ముగా రాజ్యతంత్రమెరిఁగి
యిలనుబాలించు రేఁడు, వీధులనునూడ్చు
పాకివాఁడును దేవుని భావనమున
సములు, వృత్తులు కర్మముల్ సమములగుట॥

ఎవ్వడేవృత్తి కర్హుఁడై యెసఁగుచుండు
వానికదియె స్వధర్మమై వరలుగాదె।
జాతికన్నను నీతియే చాలఘనము
హరిజనులసేవ హరిసేవ యగునుగాదె।

ధనికులందున్న లోభత్వమనెడి గుణమె
దేశదారిద్ర్య హేతువై తేజరిల్లు
రిత్త పేరాసయే పేదరికము సుమ్ము
పరమసంతృప్తియే మహాభాగ్యమగును॥

నేనె ధనవంతుఁడనటంచు నిక్కినీల్గి
మిటిసి గర్వించువానికి ముప్పుతప్ప
దెల్లధనము లనిత్యమ్ము లెగిరిపోవు
ధనమె పెనుభూతమగుఁ బ్రజాధనమెవిషము॥

### రాజనీతి

అమితసైన్యములున్న నిరంకుశాధి
కారరాజ్యములకు రక్షగలుఁగఁబోదు,
ప్రజలు నిరసించుకార్యముల్ రాజులెపుడు
చేయఁదగదు ప్రజాహిత చింతదక్కి॥

రాజ్యభద్రతకుఁ బ్రజాదరణమెమూల
కందమగుటను, రాజెప్డు కానిపనులు
చేసి, జనచిత్తవృత్తిని జెఱుపఁదగదు
రైతుక్షేమమె భాగ్యము రాజులకును॥

### సత్ప్రవర్తనము

సత్ప్రవర్తనగల నరుల్ సంఘములకు
మార్గదర్శికులగుదురు, మనుజసంఘ
పూర్ణభారము వారల భుజములపయి
నిలిచియుండును ధర్మసంకలితులగుట॥

సత్ప్రవర్తనచే మనుష్యత్వమెపుడు
పూర్ణదైవత్వముగ మారిపోవుఁగాన
అదిపొసంగనివారి విద్యాదులెల్ల
వ్యర్థములటంచుఁ జెప్పఁగా వలయుఁగాదె!

### జీవితలక్ష్యము

జీవితమ్మది దేశసంసేవకొఱకె
గాని భోగలాలసతకుఁ గానెకాదు
సేవయేజ్ఞానమని చెప్పఁ జెల్లుగాదె!
స్వార్థ మజ్ఞానమగును నిజమ్ముసుమ్ము॥

జీవితమును ధనమ్ము నార్జించుటందు
సారవిద్య ధనార్జన సాధనముగ
నెవఁడు వినియోగపఱచు నాహీననరుని
జన్మమెంచఁగ వ్యర్థమౌ జన్మమెగద!

దేహమును దేవళమ్ముగాఁ దెలిసియెవఁడు
దానిమూలాన మోక్షసాధన మొనర్చు
వానిజన్మమె జన్మము, మానవాఖ్య
కాతఁడొక్కఁడె యర్హుఁడీ యవనియందు॥

తనదు చిత్తమున్ శాశించి కొనఁగలేని
మానవుండెంత పాండిత్య మహితుఁడైన
నెట్టియధికార యుక్తుఁడై యెసఁగుచున్న
నతనినుత్తముఁడనఁగ నర్హమ్ముగాదు॥

నిష్కామ కర్మమే నిజమైనధర్మ
మేకోరికయు లేకయే సల్పుసేవ
సంసారమనుగాధ సాగరమ్మీఁద
భద్రమైనట్టి నావయనంగనొప్పు॥

ఆయుధబలమ్ము కన్నను నాత్మబలమె
వేయిరెట్లధికమ్మయి వెలయుచుండు
కత్తిపిరికికి గుఱుతగుఁగాని, వీర
పురుషలక్షణమని చెప్పఁబోల దెపుడు॥

మరణమున్ సత్యరూపులు మంగళకర
మనుచు భావింతురేగాని యడలరెపుడు
భయవిముక్తుఁడె వీరుఁడై పరిఢవిల్లు
నాత్మనెఱిఁగిని నజ్ఞానమపుడె త్రుంగు॥

అమితబాధలనందుచు నవనియందుఁ
గొట్టుకొనుచున్న మానవకోటిఁజూచి
కార్చుకన్నీరె నిజభక్తగణమునకు న
మూల్య ధనరాశియని చెప్పఁబోలదొక్కొ॥

కాననో మానవోత్తమా! దానసత్య
శౌచ దయలనుగల్గి నీసారమైన
జీవయాత్రను సాగించి చెల్లుమయ్య
ధరను మానవసేవ యీశ్వరునిసేవె॥

## స్వరాజ్యము

సాత్విక నిరోధమే మూలసాధనముగ
పరిగణింపుచు నేరాజ్యభాగమందు
ప్రజలుజీవింతు రదియె స్వరాజ్యమనఁగ
నితరములు పరరాజ్యమ్మెలే నిజమ్ము॥

## పురుషుఁడు

రాజాజ్ఞ ధర్మసంభ్రష్ట మైనపుడు
పురుషకారముగల్గు నరులట్టిదాని
మన్నింపకుంటయే మహిత ధర్మంబు
కత్తులబలముచేఁ గదనముల్ గట్టి
భువిప్రజాసామాన్యమును లొంగదీయఁ
గడఁగుట యదివట్టి యడియాసుమ్ము॥

## జాతి

ఏజాతి మృత్యువు నెల్లవేళలను
తలక్రిందనిడికొని తా నిద్రఁజెందు
ఆజాతి యత్కృష్టమైనట్టి జాతి.
మృత్యువన్నను లెక్కయేలేని వాని
నేభయంబులును జంకింపనే లేవు॥

## ఆత్మశక్తి

భుజబల మ్మాత్మబలముతోఁ బోలదెపుడు
అద్వితీయ మజేయమౌ నాత్మశక్తి
అంతరాత్మ కధర్మమైనట్టి చట్ట
ములను బిరికియుల్లంఘింపఁ బోలునెట్లు?

## సంయోగము

నిత్యసంయోగ మాహార నిద్రలవలె
నెంతొ ముఖ్యకృత్యమని భావించుటరయ
కిల్బిషాజ్ఞానమయ ఘోరకృత్యమనుచు
ఢంకంపైదెబ్బకొట్టి చాటంగఁ గలను॥

జీవుఁడా! నీవునీకొఱకే విధులను
పూనుచున్నావొ, నీదు సంతానమునకు
వానినేచేయుచుండు; మపక్వబుద్ధిఁ
జఱపి పిల్లలశాసించి భంగపడకు॥

## నీతి

ఆత్మదృష్టితోఁ బాలించు నట్టినీతి
మర్మమును మాయయును లేని ధర్మమగును
అకలుషాధ్యాత్మికంబె నైతికముసుమ్ము
ఆత్మశబ్దార్ధమే నీతియని యెరుఁగుము॥

ఓయిమానవా! నీబుద్ధిహీనతకును
దోడహంకార మోసముల్ కూడఁగలిపి
యీప్రపంచంపు ఋణభారమేల పెంప
నెత్తుల బింగిచెదోయి! శాంతిపవోయి॥

**వంచకుఁడు**

అలసటచే నాయుధమును
దలకి విసర్జించువాఁడు ధర్మమునెదుటన్
అలభగవానుని యెదుటను
దలఁపఁగ వంచకుఁడటంచుఁ దలఁపఁగ వలయున్॥

అవని సత్యవ్రతుండు చివరంటనిలిచి
ఒక్కఁడై పోరుసలుపును నిక్కువంబు
గర్వికలితుఁడై యెవఁడు నిష్కారణముగ
పవరము నొనర్చువాఁడగు వంచకుండు॥

**కృషి**

పెట్టుబడిగా ధనంబునె
బెట్టుచు మనవారు కృషినిబెంచిరి, యిపుడో
పట్టుదలతోడ కృషినే
పెట్టుబడిగఁబెట్టి ధనముఁ బెనుపఁగవలయున్॥

**దరిద్రులు**

ఒక్కపూటయె దినుచు వేఱొక్కపూట
డొక్కమాడుచునున్న యా బక్కజనుల
గూడియైక్యంబుఁ జెందక కులుకునంత
కాలము స్వరాజ్యసిద్ధి యే కరణిగల్గు?

అట్టివారె దరిద్రనారాయణునకు
నన్నదమ్ము లెరుంగు, మైక్యమ్మునెఱపి
కనికరముతో ధనేశులు గాంచరేని
భవ్యమౌ స్వరాజ్యం బసంభవముమనకు॥

## సభ్యత

హింసయె పునాదిగాఁగ నిర్మింపఁబడెడి
సభ్యతాసౌధమును కహింసాస్వరూప
బలముగలిగినయట్టి సభ్యతకు రెంట
నంతరంబెతయో గల దరసిచూడ॥

## న్యాయస్థానము

సత్యమును, ధర్మమును, సురక్షణమొనర్ప
నవతరించినయట్టి న్యాయాలయములు
నేడు ధనికుల భోగమందిరములుగను
జూదరుల కాటపట్టు లౌచున్నవకట!

## విద్యావిధానము

పరపీడనాతత్త్వ పరవశులైన
సామ్రాజ్యవాదుల సాయమ్ముకొఱకు,
అమరిన నేటి విద్యావిధానమ్ము
జప్పగామార్చి యాచదువులనెల్ల
పరమదరిద్రులౌ పల్లెవారలకు
చదువులెరుంగని జానపదులకు
నుపయోగమగు రీతినుంపఁగాఁ దగును॥

## పరిపాలనము

మిలటరీ పటాలముల బలముపయోగ
పఱచి గాదు దేశపాలనమ్ము
రహిని సుప్రజానురాగప్రతిష్ఠిత
మైన ధర్మబలమె యవసరమ్ము॥

అట్టి ధర్మకవచ మాధారముగఁదాల్చి
యేలునద్ది కాంగ్రెసే నిజమ్ము,
కాంగ్రెసునకు బ్రజలకరుణయే కవచమ్ము
గాని, మిలిటరీలు కావు, కావు॥

**మౌనము**

మౌనము జీవికి ధర్మము
మౌన మసంబద్ధముల, నమానుషముల, నె
న్నేని యసత్యంబులఁదాఁ
బూని యెదుర్కొనుటకొక యభూతాస్త్రంబౌ॥

**నియతి**

దైవశక్తి ఫలింపక తనరెనేని
లోపమేమియులేదు నీలోన నీకు;
మానవుని రాక్షసప్రజ్ఞ మహితఫల మొ
సంగిన, వినాశభీతితో సమయుఁగాదె?

నిస్పృహ నిరాశలకు లోగి నియతిదాట
తరముకానిది మానవతతికిఁజూడ
ఈశ్వరాదేశ మెవరిపై నెపుడుపడునొ?
వానిగణితంబు నెఱుగ నెవ్వరికితఱము॥

విధియశక్తుఁడుగాఁడు సర్వేశ్వరుండు,
శక్తిహీనముగా దహింసయునుదలఁప
ఈ యశక్తత మనుజునిదే యటంచు
ప్రతిదినాంతము నాకు ధైర్యమ్ముగొలుపు॥

## శాసనోల్లంఘనము

ఉర్వి నిర్దుష్ట శాసనోల్లంఘనమ్ము
నే కొలఁదిమంచి చేసిన నిచ్ఛఫలము
మహినివారయితేని సమస్త జన స
మిష్టిశక్తి సంకల్ప సమిద్ధులగుచు
దర్పణ ప్రతిమానులై తనరవలయు॥

## శాంతి స్థాపన

కత్తి దూయుటవల్ల ఘనతరంబైన
శాంతిసంస్థాపన జరుగంగఁబోదు
ధరనిరాయుధజాతి ధర్మపథాను
సారియై కష్టనష్టముల నెదిర్చి
జయమందినప్పుడే శాంతినిల్కడకు
ఏకైకమార్గమం చెరుగంగవలయు॥

మనలోమనకు విభేదము
లును, నొక్కరియందు నొకరులోట్లు నెతుకుటల్
తనూరూపంబును. దీవ్రత
యును దాల్చిన హింసయనుచు నూహింపఁదగున్॥

ఇపు డహింసయె మనలోన నిమిడియున్న
అవతరింపదంతర్యుద్ధ మనెడితెవులు
వైమనస్యముల్ గలుగ, వపారహింస
యేనుబీల్చెడి గాలిలోనే వసించు॥

అరులు బలహీనులైయున్న యవసరమున
సందుదొరకెఁగదా యని స్వప్రయోజ
నమును సాధింపఁజూచు టనామధేయుఁ
డగు నహింసావ్రతుని ధర్మమౌనుసుమ్ము॥

తనశక్తియు, దనధైర్యముఁ
దనఋజుమార్గంబుఁ దనదు ధార్మికతత్త్వం
బును నాధారంబులుగా
మనెడు నహింసాపరుండె మాన్యుఁడు ధరలో॥

చెడునడవడి గలిగిన పురు
షుఁడు చేతలయందుకంటె జూపు తలఁపులన్
కడుచెడుగు గలిగియుండును
వడి హింసయటన్న గూడ వాఁడటులె కనున్॥

**లక్ష్యసిద్ధి**

తలఁపులందు దాగిదాగి యున్నట్టి హిం
సాస్వరూప బీజ సముదయమును
బెఱికివేసి లోని బేధంబు మాపుడు
లక్ష్యసిద్ధి కిదియె లక్షణంబు॥

**శూరుఁడు**

నీచమైన భీరుత్వము నెఱసి చచ్చు
కంటె ధీరత్వమున మిత్తిగనుటమేలు
ఎదిరినొక దెబ్బకొట్టి యాయెదిరిచేత
నొక్క దెబ్బనుదిని ౘగ్గుమోయిశూర।

**అల్పజాతి**

దైవంబు తనదు సంతానంబునందు
నల్పాల్పులని జప్పనైనట్టి వారి
మూలంబుగాఁ దన ముఖ్యకృత్యముల
నొనఁగూర్చు కొనుచుండు నొక్కొక్క వేళ
కాన నల్పానల్పగణనంబుఁ దక్కి
యుండుటయే మన కుచితంబుగాదె!

## విశ్వాసము

ఈశ్వరునిపయి మఱియు నహింసపయిని
జనులకు సజీవమైన విశ్వాసగరిమ
వృద్ధిగావలె, వారి జీవితములను, వి
రాజిలంజేయు దివ్యమౌ తేజమిద్ది॥

ఇది సచేతనమౌ సమిద్ధతేజంబు
ఇది శుద్ధ చైతన్యమే సత్యముగను
నరజీవితముల నన్వర్థమ్మొనర్చి
వెరగొందఁజేయు నీ విశ్వాసగరిమ॥

## రాష్ట్రీయత

దేశమంతకుఁ బుష్టితెచ్చెడిరీతి
రాష్ట్రీయతపొసంగి రహిమించవలయు
ఉపనదుల్ రాష్ట్రమ్ము లొకమహానదియె
దేశము, దాని విస్తృతి నందఁజేసి
తమశక్తియును స్వచ్ఛతయు దేశనదిని
ప్రతిబింబితమ్మొచుఁ బ్రబలంగవలయు
పోష్యపోషకభావ బోధమ్మువలన
నదులు, దేశమ్ములున్నతిగాంచుగాదె॥

## భాగవతులు

భాగవతులకు మిత్తినా భయము గలుగ
దదియెకానొక సుఖనిద్రయగును వారి
కట్టి నిద్రానుభవము తానవలవచ్చు
మెలఁకువ ననంతసుఖముతో మేళవించు॥

సంకల్పబలమున్న జనులు పశుత్వ
కూపమ్మునందునఁ గ్రుంగిపోవకయె
మానవత్వమును సంపాదించికొనుచు
భగవదనుగ్రహ పాత్రులై వార
లలప్రపంచపు మన్ననల నెల్లవేళ
శాశించుకోగల్గు చతురులయ్యెదరు॥

### నా కోరికలు

నన్ను బ్రేమింపనట్టి యానరులవలన
జీవనమొనర్చి నీచత చెందుకంటె
నన్ను బ్రేమించినట్టి యానరులకడనె
చచ్చుట ప్రియంకరమ్ము నిశ్చయము సుమ్ము॥

పుడమి నస్పృశ్యతా వినిర్మూలనమ్ము
కాని పక్షాన భారతఖండమందు
హైందవమతమ్మె నాశనమ్మౌట మంచి
దంచు నాదగునిత్య సంప్రార్థనంబు॥

### పరిశీలనము

హృదయమునుగాంచి నిను గౌరవింత్రుగాని
పై పయినిజూచి గౌరవింపగనుబోరు
ఇది మహాత్ముల లక్షణమిందుసత్య
సమ్మతమ్మగు నవబోధసారముండు॥

### వలంటీరు

ధర్మమార్గరతుండు నిస్తంద్రగామి
భావివేత్తయు హింసావివర్జితుండు
నిర్జితాహంయు వుపకార నిరతచిత్తు
డగు వలంటీరు లోకహితార్థకరుఁడు॥

## మలినమనస్సు

మలినమగు మనంబు మఱిమఱియుపవాస
ములనుజేయ శుద్ధిఁబొందదెపుడు
దైవచింతనమునఁ దదనుగ్రహమ్మున
నిర్మలత్వమందు నిశ్చయంబు॥

మకిలమగుమనంబు మకిలమౌతిండ్లకు
మరులుకొనుచుగాని మరలదెపుడు
భోగములను చవులఁ బోవీడి దానిని
నిగ్రహించి చేతనిలిపి కొనుము॥

## భిక్షుకులు

ఇపుడు మననాట యాచకవృత్తి హెచ్చె
ఆకటికిఁజచ్చు జనసంఖ్య యధికమయ్యె
మనధనికులెల్ల వారికిఁ బనులఁజూపి
తిండికలిగించుటకు బదులు తిరిపమిడుచు
వారిఁ బోషించుచుండ్రి యప్పనముగాదె?

## జీవితబీమా

నిన్ను బుట్టించినట్టుఁలే నీదునాలు
బిడ్డలనుగూడఁ బుట్టించి పెంచినాఁడు
ఆలుబిడ్ల పరాధీనమందునుంచు
టగును భీమాయటన్న నీవరసికొమ్ము॥

ఎవఁడు 'బీమాను' జేయింపనెంచు, వాఁడు
పరమభీతుఁడటంచుఁ జెప్పనగుసుమ్ము
వాని కీశ్వరునందు విశ్వాసబుద్ధి
శూన్యమని జెప్పకయె చెప్పుచుండునదియె॥

**సంగతి**

ధర్మజాగృతి జీవనత్యాగవృత్తి
దరనిడాంబరత్వము నెరిగి యెవ్వఁ
డాచరణమందు నిల్పునో యట్టి పుణ్య
పూరుషునితోఁ బ్రసంగతి కోరుకొనుము॥

**తిండి**

తిండియెట్టిదొ త్రేఁపట్టిదే జనించు
భోజనమ్మెట్టిదో జీవనమ్మునదియ
విత్తొకటి చెట్టువేరొక విధముఁగాదు
కానపండ్లను నాకుల కాయలదిను
నట్టివారికి బ్రహ్మచర్యమును, చిత్త
సంయమనమును చులకనై సాఁగుగాదె।

**అజ్ఞత**

చీటిమాటికి వెజ్జులచెంతజేరి
రసవిషాదులచే శరీరమునునింపి
ఆయువు నిరాయువగునట్టు లాచరించి
తాను తనదేహమునకు రాజైనమాట
మరచి 'బంటయి' తుదకిక మానవత్వ
ముడుగుచున్నాఁడు మనుజుఁ డేమున్నదకట।

**దేవుఁడు**

ఇల్లు ముల్లెలువీడని యెడలనీవు
దేవునెన్నండు గానంగ లేవుసుమ్ము
దేవుఁడేనీవు, నీవెయా దేవుఁడగుదు
అర్థమున కర్థము గ్రహింపనగును మనకు॥



# అప్పన్న

**(హిందూసుందరి – ముద్రితం)**

సింహాచల వరాహనరసింహుడు – శివుడా? లేక మాధవుడా? అని సందేహము – అది శివాలయమే అని తరువాత వైష్ణవాలయముగా మార్చిరి అని కవి కొన్ని ఋజువులు చూపించినారు.



# అప్పన్న

ఏకమేవాద్వితీయ మంచెంచి శ్రుతులు
శాస్త్రముల్ పురాణంబులు చాటిపలుక
నెవ్వడైన నీకేమని యెంచెదేమొ
శివుడవా? లేక నీవు మాధవుడ వొక్కో?

శంఖచక్రగదాశార్ఙ్గ చయములేదు
తడవి చూచిన నాల్గుహస్తములు లేవు
స్వచ్ఛమౌ లింగరూపము స్వామి? నీది
శివుడవా లేక నీవు మాధవుడవొక్కో?

పాలసంద్రములో పాముపడకలేదు
ఈశుపోల్కి కైలాసమునెక్కియుంటి
గంగధారయె కొండపై గల్గుధార
శివుడవో? లేక నీవు మాధవుడవొక్కో?

శూలిగుడిలోన రీతి నీ యాలయమున
చుట్టుదారులు నాపైని సోమసూత్ర
మును లగించిరి వైష్ణవమునకవేల?
శివుడవో? లేక నీవు మాధవుడవొక్కో?

మృదుని పోలికగా గర్భగుడికి నడుమ
నిలిచితివదేల? విష్ణుమూర్తులకు గుడుల
గోడచేరుపే కనుపించు నేడగనిన
శివుడవో లేక నీవు మాధవుడవొక్కో?

తైల దీపము సుంక భద్రమ్మనంగ
వెల్గుచుండ నీ యెదుట నేవేళలందు
అదిశివప్రీతియండ్రు నీకౌనెప్రీతి?
శివుడవో? లేకనీవు మాధవుడవొక్కో?

తిరుమణియు దిరుచూర్ణము దిద్దినొసట
నామములు వెట్ట కొడలెల్ల భ్రామికానేదు
దివ్యచందన మా మహాదేవు పగిడి
శివుడవో లేక నీవు మాధవుడవొక్కో?

ఇట్లు మెత్తిన చందనమేటికొక్క
సారిబంగరు గునపాల చక్కనొలిచి
గొప్పయుత్సవముం జేసికొనెదరంట
శివుడవో?లేక నీవు మాధవుడవొక్కో?

గిత్త తత్తడి గాన నా గిరీశుడెలమి
బసవలను దానమిచ్చిన బట్టగలడు
ఇచట భక్తులు వాని నీకిత్తురేల
శివుడవో లేక? నీవు మాధవుడవొక్కో?

పుల్లగుమ్మడిపండ్లు విభూతిపండ్లు
లింగమూర్తికి ప్రీతి యాజంగమునకు
ఇచటభక్తులు వాని నీకిత్తురేల?
శివుడవో? లేకనీవు మాధవుడవొక్కొ?

చేతురంట సహస్రఘటాభిషేకములను
చందనోత్సమేటేట జరిపెదరట
శైవసంప్రదాయమ్ములీ చర్యలేల?
శివుడవో? లేక నీవు మాధవుడవొక్కో?

ఇన్నిటికినేమిగాని విఘ్నేశ్వరుండు
నీదుముందరతానేల నెలవుకొనెను?
కలిగెనా దేవిడిమన్న గరుడునకును
శివుడవో? లేకనీవు మాధవుడవొక్కో?

ప్రక్కఁద్రిపురాంతకాలయ భాగమందు
ఏలొకో నందులై దార్వసించియుంట
మాన్యరామానుజుల తిరుమంత్రమిచటి
వానికుచ్చాటనంబయి వరలెనేమొ?

నీదు కొండపై బిళ్ళగన్నేరులు బిల్వ
వృక్షముల్ తరచుగనుండ నేలనయ్య?
అప్పనయటంౘు నారసింహాఖ్యయేల
శివుడవో? లేకనీవు మాధవుడవొక్కొ?

కప్పాలకంబమిప్పుడు
కప్పస్తంభముగ మాటికాంతలకౌగిం
ట్లప్పనగొను చుండుట నీ
వప్పనవైనావె శివశివా శివలింగా!

కారణములిన్ని గల్గ నే కరణినిన్ను
ఆక్రమించిరో వైష్ణవులక్కట కటా
పొగపుపులియోర చక్కెరపొంగలికిని
మరగి తద్వశమైతివా స్మరహరుండ?





# క్రొత్త గోదావరి

కాటన్ బ్యారేజి నిర్మాణానికి ముందు వర్షాకాలములో గోదావరి వరదలు సర్వ సామాన్యము – కవి జన్మించినది గోదావరి సంగమస్థానం – ఆనీటి ఉరవడి సమీపమునగల లంకగ్రామాలు, జనవాసాలను కూడా ముంచెత్తతూ ఉండేది. ఆదృశ్యాన్ని కవిత ద్వారా కన్నులకు కట్టినట్టు చూపించారు.



# క్రొత్త గోదావరి

నీ ప్రవాహోఘూత నిమ్నోన్నత సువర్ణ
సైకతస్థలుల విస్తారమరసి
నీ గాఢవేగౌఘ నిర్మూలిత మహామ
హీరుహ సంపాతమెల్లగాంచి
నీ చలత్కల్లోల నిర్ఛిద్ర హల్లోహ
లానందభైరవీ గానమువిని
నీ నితాంతగభీరనిస్తులాయత మహా
శక్తి స్వరూపంబు భక్తిగాంచి
నీ నటన భంగిమమ్ములన్నియును జూచి
నీదు జిలిబిలిపలుకులన్నియును వినుయు
నిన్ను దర్శించి సంస్తుతుల్ నెఱపి,
ధన్యతనుగాంచితమ్మ గోదావరమ్మ!

ఒకప్రక్కనాత్రేయి యుఙ్ఝూతలూగుచు
స్వాగతంబిడి కూడి సాగుచుండ
ఒకట భారద్వాజముప్పొంగిపొరలి యం
తర్వాహినిగగూడి తరలుచుండ
ఒకవంక గిరి నిర్ఝరోగ్రప్రవాహముల్
జోడుగా నినుగూడి యాడుచుండ
ఒకయిక్క ప్రళయమేఘోజ్ఝిత వారిధా
రాసహస్రములు నీ రాసదీర్ప
నిండియోజనాయి తమయి నీదు మూర్తి
కనులపండువొనర్చె మస్కరిపురంబు
పావనంబయ్యె మాపుణ్యఫలముపండెఁ
తల్లినతులివె కొమ్మ గోదావరమ్మ!

తల్లి నీకరడములు హస్తములరీతి,
వాని కలకలరవము నీ పాటలట్లు
నీదు వేగముపరువట్లు నీదుమూర్తి

ముసలిముత్తైదువట్లు నీపూర్ణవారి
యొడలునిండగదాల్చినం ముడుతలొప్పు
ఖద్దరుంగట్టుకోకట్లుగానుపింప
వెనుకదృష్టియేలేని నీ వేగమందు
బతినిజేరగనుబలాటపడుట దోప
జంగమాకారమెపుడు గోచరముగాదె
తల్లి నతులివె కొమ్మ గోదావరమ్మ!

ఎందరు పుణ్యమూర్తులిక నెందరు మాకులవృద్ధులింక వే
ఱెందఱు మాపితామహులహీన సువర్గపథంబునంద నీ
యందున డిందిరోయిచటనట్టి మహాత్ములనంత సౌఖ్యముల్
పొంది సుఖింతురే? శఫరలోలవిలోచన! మాకుదెల్పవే.

నీయసమానమూర్తిగని నిత్యముద్వజ్జల మజ్జనంబునే
జేయగజాలుపున్నెమును జేయగనైతి శ్వవృత్తిఁజిక్కి యె
న్నోయగచాట్లఁబొందుచు నినుంగననైతిని పుణ్యమాతృకా
మా యపరాధముల్ సయిచి మమ్ము గృతార్థులజేయుమమ్మరో
కాని నాపరాధీనతా కారణంబ
వీవ యనిపల్క కోపమేలే మదంబ
నిజముపల్కిన నేరికి నిష్ఠురమగు
నైన నిను గొన్నిమాటలనాడ దలతు

కట్టచిరార్జితంబులగు కాంచనమాన్యములెల్లఁ ద్రవ్వినీ
పొట్టనుబెట్టి ముంచితివమోఘపు గట్టడముల్ పగిల్చియుం
బుట్టలతోడఁగూల్చితివి పూర్వపుగ్రామము, గుళ్ళగోపురా
లిట్టె నశింపజేసితి సీ! యిదిచెల్లునె గౌతమాంబికా!
కానిగ్రుడ్డిలోమెల్ల, ఈ కష్టకాల
మందుబుల్లల గూర్చితివంతెచాలు
ప్రొయ్యిక్రిందిదికూర్చు పూబోడివయ్యు
ప్రొయ్యిమీదిది కూల్చిన ప్రోడవుగద

కూలిన గట్లు లంకలును గూలిన చెట్లు సగంబు విర్గియుం
గూలిన కొంపగోడలును గూలపు భూముల మిఱ్ఱుపల్లముల్
చాలగనీదు దారుణములన్ దగజెప్పక చెప్పుచుండె నీ
లీలల సర్వనాశము బళీ ఘొనరింతువె? గౌతమాంబికా!

నిను గొనియూడంగ నేర్వలేదని యేమొ
భట్లపాలిక నాశపఱచితీవు
బాడబుల్ శ్రుతికర్మ బాహ్యులైరని యేమొ
మస్కరిపురి గూల్చి మసలితీవు
నీకూర్మిపతిగట్టె నాకోపముననేమొ
ముంచి రామునిలంకముట్టి తీవు
బ్రాహ్మణాభావమేర్పడు కారణమున నో
బ్రహ్మపురిని బాడుపఱిచితీవు
బీదసాదుల బీలిచిపిప్పి చేయు
కఱవుబాధచే లోకముగాసి చెంద
గోటిచుట్టుపై రోకలిపోటురీతి
దప్పదా నీదు బాధ గోదావరమ్మ!
ఇక్కడలంకలెత్తి మరియేడకొ చేర్చెదవాడ పల్లముల్
చక్కగఁబూడ్చి సైకత విశాలమొనర్తువు మళ్ళుత్రవ్వియా
యిక్కమదుంగొనర్తు వరరే! యివియేగద గంగవెఱ్ఱుల
మ్మక్క! భవద్విలాసములకర్థములేరు వచింతురమ్మరో?

గంటిని జోడినింబుడమ గగ్గులకాడొనరించి వెల్లువన్
మంటిని ముంచికొట్టి తగునా యిటులారబముల్ హరింప మా
పంటలనిట్లు మంటగలుపన్ మఱి కప్పములిచ్చుటెట్లు వా
ల్గంటి! రవంతచెప్పుమిది? రైతుల నెత్తిని గొట్టుటే గదా!



# త్యాగపరీక్ష

ఇది 'భారతసారము' అనే సంస్కృత పురాణము నుంచి గ్రహించబడినది. కరుణరస ప్రధానమైన ఇందు కర్ణుని వదాన్యత శ్రీకృష్ణుడు అర్జునునికి చూపించి కర్ణునికి మోక్షం ఇస్తాడు.



# త్యాగపరీక్ష

కదనరంగాన కదలను మెదలలేక
యనదయై పడియున్నకర్ణుణి వదాన్య
శూరతఁ గిరీటికిం జెప్పి చూపఁదలఁచి
పన్నె నొకపన్నుగడ చక్రపాణి యపుడు.

దిక్కును మ్రొక్కు లేక పరిదేవనమందక దైన్యభావమున్
పొక్కఁగనీక ప్రాణములపోకకునై తటి వేఁచి యూర్పులన్
లెక్కలువెట్టు సూర్యసుతునిం గని వృద్ధుఁడు బాపఁ డర్భకుం
డొక్కని గూడి కర్ణుఁ డెటనుండెనొ యాడకుఁ జేరి యిట్లనున్

కవచకుండలనిసర్గప్రభల్ తులకింప
మిహిరుదివ్యాంశ జన్మించినావు
పాకశాసనియంతవాడు యాచింప మో
దించి తద్వాంఛ పూరించినావు
అంబాప్రలోభనవ్యాహారవాగురఁ
జొరఁబోక ప్రభుభక్తిచూపినావు
కుంతీమహాదేవి కోరఁగా సుతభిక్ష
మన్నించి యనుజుల మనిచినావు

అడగనట్టివారిది పాప మనఁగ యాచ
మానజనవాంఛలం దీర్చి మహితలమున
కర్ణుఁ డొకవిశ్వదాతయన్ ఘనత నంది
శిబి దధీచి ఖేచరుల మించితివి కర్ణ !

కాలమునందె మేఘుఁడు నికామసువృష్టి నొసంగు, నట్టులే
కాలమునందె వృక్షములు కాచి ఫలించుచునుండు, భూమియుం
గాలమునందె పండును జగంబుల గోవులు నట్లె, నీవొ యే
కాలమునందునేని ససిగా ఫలియింతువు దీనబాంధవా!

పచ్చనివృక్షకుంజముల భాసిలుఖాండవ మర్జునుండునున్
చిచ్చు రగిల్చి స్వర్గమనఁ జెల్లెడిలంకను వాయుపుత్త్రుఁడున్
చిచ్చుఱకంటివాఁడు మరునిం దెగఁగాల్చిరి లాభమేమి? యీ
మచ్చులుమాపులేమిని శ్రమంపడియైనను గాల్చ రెవ్వరున్.

దేహము క్రుంగిపోవు, నతిదీనత తోఁచు స్వరమ్మునుం, దనూ
దాహము గల్గు, మిక్కిలి విదాహము పుట్టును, స్వేదబిందుసం
దోహముతోఁచుదుర్మరణదోహలమూర్తియు యాచకుండునున్
స్నేహితులన్నమాట గమనించియుఁ జేరితి నిన్నుఁ గోరగన్.

ఏనొక బీదబాపడ మదీప్సిత మాత్మజకున్ వివాహ మ
ద్దాని నొనర్ప ద్రవ్యముగదా తగుసాధన, మందుకోస మీ
దీనుఁడు నిన్ను జేరెను త్వదీయపరిస్థితి యిట్టులుండె నో
రైనను నాడకున్నదిగదా! మఱియెక్కని వేఁడఁ బోదునే?

ఏదుర్మహూర్త వేళను
ఏ దుశ్శకునమ్మురాక నిలు వెడలితినో
ఆదుష్ఫలితం బూరకె
పోదిఁక నాకార్యసిద్ధి పొగిలిపొకాలెన్.

భయభక్తుల ముదుసలి యిటు
పుయిలోడక పలుక సూర్యపుత్త్రుడు నగి, అ
య్యయొ యంత్యపరీక్షా యిది?
"అయాచితం బ్రాహ్మణాయ" అను టెఱఁగనొకో?

నాయమె బాపఁడా యిటులనన్? బ్రతుకుండఁగ నొక్కయర్థి రా
ధేయునిజేరి కోరికలుతీఱక వేఱొక దాతఁ జేరుటా?
ఆయతి నాతలన్ నఱకిన ట్లగునయ్యది నే సహింప నా
ధ్యేయము నెగ్గనిమ్ము కడతేరఁగ నాజని సార్థకంబుగన్.

గడియకొ గంటకో త్రుటికో కాయ మపాయముసెందు లేవలే
నుడుగనితీవ్రవేదన యెదో కదలించు నెదన్మహాత్మ ! బా
పడ వడుగంగ వచ్చితి శుభార్థము లే దన లేదు నాల్క, నా
పడతిని జేరికొమ్ము కొననచ్చును నీకగుపూర్ణవిత్తమున్.

కటకటా నేను నొక్కముక్కాలిముసలి
నడలు తడఁబడు దృష్టి కానదయె ససిగ
పడుచు లేచుచు నీపజ్జ పట్టినాడ
పట్టియవలంబనమ్మన; భావ్యమె యిది?

నే నెటుపోవువాడ? భవదీయవియోగనిరస్త చిత్తయై
తా నిడుటెట్లు నా కిది వృథా, కలదేనిట నాసువీసమో
దాన మొనర్చి యీముసలి ధన్యుని జేయుము, నీ ప్రతిష్ఠ నీ
క్షోణిని సూర్యచంద్రులు వసించెడిదాక వసింపఁజేసికో.

అన విని సత్యమేయది మహాద్విజ! అన్నటు జ్ఞాపకమ్ము వ
చ్చిన, దివె రెండుపచ్చలు ఖచించితి నామునిపండ్ల, డుల్చికొ
మ్మన, అటు నేను చేయగలనా? మఱి లేదనఁ బోయెగాని యం
చును నెటకేని బోఁదలఁచుచో రవిసూతయు దోయిలించుచున్.

కాళ్ళుసేతులు నడుము భగ్నములు నాకు
అల్లదిగో నీలశిల దాని నందికొమ్ము
తెమ్ము నాదరి కోబ్రహ్మతేజ! యిపుడె
తెమ్ము భవదీయవాంఛ సంధింతు నిటనె.

శిలను మోచితెచ్చు చేవయే గల్గుచో
దానకర్ణ ! యింత దైన్య మేల?
ఎటులో యీడ్చితెచ్చి యీజీర్ణ తనువును
నీసమక్షమందు నిలిపికొంటి.

నిజము భూదేవ! యెట్టులో నేనె జరిగి
శిలను జేరెద నొకగడె నిలువుమయ్య
అర్థి నైరాస్యమంది పాపౌఘ మొసఁగి
దాతపున్నెము సేకొంత తథ్యమయ్య !

అనుచున్ ఊమ్మునఁ గొంతిప్రాకిజడుడై యాయాసభారమ్ము చే
కొని యల్లల్లన డేఁకియుం బొరలియున్ ఘూర్ణిల్లుచున్ బారుచున్
రణరంగస్థలి నున్నసీలశిలఁ జేరంబోయి యోభూసురా!
నను ధన్యాత్ముని జేయ రమ్మిటకు వాంఛాసిద్ధి నీకయ్యెడిన్.

పడుచు లేచుచు బాపఁ డర్భకునియూఁతఁ
జేరె నటకు, రాధేయుఁడు శీర్ష మెత్తి
బండరాతిపై నోటిని బాదుకొనుము
దంతభంగ మొనర్చె రక్తము స్రవింప.

నరుకంటంబడు జాతినాడు కసితో నాజన్మ మేలంచు ను
ర్వర శీర్షమ్మును బిట్టు మోఁదుకొని చావంజూచిన ట్లయ్యె, పో
టరి కర్ణుం డట నెత్రుకారుమునిపండ్లన్ రెంటినిం దీసి భూ
సురవర్యా! కయికొమ్ముమీని నని యంచున్ జేతి కందిచ్చుచున్.

ఈ మునిపండ్ల పచ్చులవి యెన్నటివో? ఒకపచ్చ చాలు నీ
కామతవిత్తమున్ బడయఁగాఁ గొను రెంటిని, విప్రవర్య ! వే
దామలమూర్తి ! నీవొక మహాశిష మిమ్మిదె చాలునాకు, నే
నీమహి వీడిపో సమయ మియ్యది, కోరెద నాత్మశాంతికై.

తడిసెను నేత్రునం దివికదా మతి యెంగిలివస్తు వౌట నే
వడువున నే గ్రహించెద? నవారిగఁ బచ్చుల దుల్చి వారితో
కడిగి యిడం గ్రహించెదనుగాని యిటైనను నాదుమానసం
బొడcబడ దంచుcబల్కగ నోహోయని కర్ణుcడు తత్తరించుచున్.

శ్రీహరీ! యింతచేసినం జివరికేని
మాట దక్కద; నీర మేమాడ్కి దొరకు?
ఐనc బ్రార్థింతు దయగలదేని మోయి
జలద! నాలుగుధారలు జార్చు మయ్య !

ఆపన్నార్తిహరా ! ఘనాఘన ! మహాత్మా ! అర్థికిం దాతకుం
దాపం బార్పcగ జీవనంబు లిడుమా:-ధన్యోస్మి, నీచూపులో
నాపై సోదరభావము న్నెఱపుచున్ నాకోర్కి చెల్లించి తో
బాపండా ! యిcక వీని బుచ్చికొని నా భాగ్యంబు పండింపవే !

అని యిటు లాతిధేయపరమావధు లంటినకర్ణుముcగలన్
కనదురుదీప్తిc జక్రకనకాంగదరత్న కిరీటకుండలుం
డును, అతసీసుమాభతనుడున్ జగదేకగురుండు కృష్ణుcడ
ల్లన నరుతోcగనంబడ మహాద్భుత మందుచుc గర్ణుc డిట్లనున్.

హస్త పాదము చెడను సాష్టాంగ మెఱcగ;
లే నిదె షడంగనతి చక్రపాణి నీకు
ఏమి నీయద్భుతపరీక్ష ! స్వామి యిందు
నెగ్గితినటన్న నీకృపానిరతి గాదె!

నరనారాయణమూర్తి యంతట మహానందంబుతోc గర్ణ ! నీ
పరమం బైనవదాన్యతాగరిమ భీభత్సుండు వీక్షింపcగా
జరిగెన్, నీతుదివాంఛ కోరు మెదియేన్ సాగింతు నేనంచు నా
హరి పల్కన్ కనుదోయి చెమ్మగిల సత్యంతార్తిc గర్ణుండనున్.

తెలియకకాదు నీమహిమ, తీరు లెరుంగకకా దధర్మమే
గెలుచునటంచుఁగాదు ఘనకీర్తికి లోఁబడికాదు,మిత్రతా
బలమును ప్రాక్కృతమ్ముఁజలపట్టఁగ నిన్నెదిరించు టయ్యె,నీ
తలఁపిది; దీని కడ్డుగలదా? జగదేకనియంత ! మన్నతుల్.

పుట్టిననాటినుండి తలలఁపున్ వలపున్ విడనాడలేనియీ
మట్టిశరీరమం దనుపు మాయము కాఁగ, శ్మశానభిన్నమై
నట్టితలానఁ దద్దహన మార్చుము, త్వత్పదభక్తి నిమ్ము నా
గుట్టగుమీఁదిపుట్టువులకున్, ఇది నా తుదికోర్కి మాధవా !

అన సర్వంసహ నాదరాన నట కాహ్వానించి గోవిందు డి
ట్లను, రుద్రాంకముగానితావు భవదీయాంగంబునం గల్గునే?
యన; నేనొక్క మహాశ్మశానమను నాయం దెందరో కర్ణు లిం
కను భీష్ముల్ మఱి ద్రోణులున్ దహనసంస్కారంబులం బొందరే !

నాలోనుండి చరాచరప్రకృతి జన్మంబందుచున్ డిందుచున్
నాలో లీనము నందుచుండ జగదంతర్యామి ! తద్ధ్వంసమే
నాలీలాసువిభూతి, నేనొకశ్మశానంబౌటఁ దభ్భిన్న మిం
దేలా తోఁచు? నెఱుంగ నట్లడు నేనేమందు దామోదరా?

వల్ల కాఁడుగాక చెల్లెడిచోటు నా
యందు నణువులే దటంచుఁ బలుక
విపులనుడుల వినుచు విశ్వంభరుం డప్డు
కర్ణు నుద్ధరింపఁగాఁ దలంచి.

నాదుకుడిచేయి బలిదహనమున కయ్యె
కలదు వలచేయి, యిందె యీకర్ణు దేహ
దహన మని నిశ్చయించి యాపత్తత తొలంక
తీర్చె నాదానకర్ణు నంతిమపుదశను.



# శ్రీనాథ హృదయము

ప్రౌఢరాయల ఆస్థానములో నున్న డిండిమభట్టును జయించడానికి వెళ్ళే ముందు శ్రీనాథకవి ఊహలు ఎలా పరుగులెత్తాయో అనే విషయాలు స్వభావసిద్ధంగా ఊహించబడినవి.



# శ్రీనాథ హృదయము

వేళయ్యె నను కేకవిసరుతో నుమ్మగి
ల్లనియోదనమ్ము వడ్డనము సేయ
కట్టావితో వంటకము లుంచుతావులఁ
గదలీపలాశమ్ము కమరిగిల్ల
వేఁడిసోఁ కోర్వని వ్రేళ్ల నూదుచును దుం
దుడుకుతో నుడుకునుమెడుకు జుట్టి
కడి మ్రింగువడక గ్రుక్కెడునీరు త్రావి ప
చ్చడుల వాచవికేని చవినిగొనక

తెమలి సాపడి మన సౌకతీఱు గాఁగ
సరిగవలిపెంబు గట్టి, పచ్చడము గప్పి
కుండలమ్ములు చెవలుందుఁ దాండవింప
గఱ్ఱునను ద్రేన్చె శ్రీనాథకవివరుండు

రాఁచి అంపము వెట్టి యేఁచనే యనురీతి
తములపాకులకు సున్నమును రాఁచి
చీల్చి చెందాడనే చెలరేఁగి యనురీతి
వ్రీల్చి యీనెల బిట్టు విసరివైచి
వంచి చుట్టగఁజుట్టివైవనే యనురీతి
నాకుపాయలు చుట్ట లమరఁ జేసి
నమిలి మ్రింగకయుందువనా యన్నరీతిని
వక్కాకుమడుపులు చక్క నమిలి

వాదమున డిండిముని ముడివైచి పట్టి
యతనినెత్తురు పిండనే యనెడిరీతిఁ
దములపురసమ్ము నెట్టగా నుమిసి యుమిసి
వీడియుము తీర్చెఁ గవిరాజు వేడ్కమీఱ.

డిండిమభట్టు వాదమున డీకొనుసాహసకార్య మద్ది య
ట్లుండ మహేశదత్త మహిమోజ్జ్వల మైనది కంచుఢక్క నె
వ్వండు జయింపఁగాఁగలుగువాఁ డయినన్ బరదేవతావరం
బుండెను గాదె; దీని కిటు లుల్కగ నేటికె వెట్టిడెందమా!

ఎక్కడిగౌడదేశ మితఁ డెక్కడి కెక్కడనుండి వచ్చెఁ బే
రెక్కినయొక్కఢక్కను వహించి జయించుచుఁ బండితావళిన్
ధిక్కృతి సేయుచుండెఁ గడుధీరత, నీతనికంచుఢక్కలన్
జెక్కలుముక్క లౌనటులు సేయనిచోఁ బరు వింకఁదక్కునే

పుణ్య గోదావరీ వారిపూత మైన
యాంధ్ర దేశానఁ గవిపండితాళి కిపుడు
కఱ వటంచు నీ డిడిమకవిని బ్రౌఢ
రాయలు నరించెపో కవిరా జటంచు.

పుట్టించితి కవిగా నను
గట్టించితి బ్రౌఢమధుర కావ్యము లెన్నో
మెట్టిన దేశములన్ జే
వెట్టంచితి నీదుకరుణపేరిమిఁ గాదే?

అమ్మా ! భారతి ! అందరానిఫల మౌనా? యైన నాశింపఁ బో
వమ్మా ! నీకరుణాకటాక్షలవదిగ్ధాత్ముండ నౌ నాకు నే
లమ్మ! యోటమి? యైనమానసము డోలాందోలితం బౌనుమా
యమ్మా ! యన్నిటికీవే యుంటివిగదమ్మా తల్లి ! వాగ్దేవతా !

ఇరువురిలోన వాదమున నేరు పరాజితు లైరో వారి యా
బిరుదములున్ బహూకృతులుఁ బేరును బెంపును సుప్రతిష్ఠలున్
దిరపడు గెల్చుకొన్నకవిధీరున, కిద్ది పణంబు మాకు, నా
పరపతి నిల్వబెట్టఁగల భారము నీయదె సుమ్ము భారతీ!

ఇదియొకతీరుకర్కశపరీక్షగ మానసముం గలంచుచు
న్నది జననీ ! బిభీషికల కర్భకురీతిగఁ జేసితే ననున్
బదిలము సుమ్ము నా పరిభవ మ్మది నీయది గాద నా జయం
బిదియును నీదె కాద ? పరమేశ్వరి ! తోచినరీతిఁ జేయుమీ !

దేశదేశములెల్లఁ దిరిగి దిగ్విజయమ్ము
నెఱపి యార్జించిన చిరయశస్సు
సకలసంస్థానరాజన్యుల నొప్పించి
విలిచికొన్నట్టి నిర్మలయశస్సు
నిశితశాస్త్రార్థపాండిత్య శౌండత మించఁ
బూరించుకొన్న యద్భుతయశస్సు
బహుకావ్యనిర్మాణభారతీసేవాత్త
గురుతరశస్త విస్తరయశస్సు

కవికులసుదుర్ల భంబు లౌ ఘనత లంది
వెలకు మీఱి చేకొన్న నిస్తులయశస్సు
నేఁటితో నాకసము నంటి నెగడుటో ర
సాతలము నంటి యణఁగుటో జరుగఁగలదు.

పద్దెము లల్లుటో మధురభావము కూర్చుటో, యాశుధారలో
ముద్దులు మూటగట్టుటో యపూర్వనిమేషకృతు ల్రచించుటో
యొద్దిక శాస్త్రపాఠములో యొజ్జతనంబులొ గాక తేఁకువన్
గద్దెల నెక్కి దిగ్గిజయకాంక్షల వాదము లేల భారతీ!

ప్రౌఢరాయలంతటివాఁడు పరమభక్తి
గౌరవము లంగరక్షగా ఘనతఁ బెంచి
నట్టిడిండిమభట్టసింహమును నేఁడు
నీదుదయ లేక యోడింప నేర్తునమ్మ ?

గడచిన దింతగా వయసు, కాంచితిబేరుఁ బ్రతిష్ఠ కొంత, దుం
దుడుకులు కొన్ని దాఁటితి, వినూతనసత్కవితాపథమ్ములం
దడుగులు వెట్టియుంటి, రుచిరార్థమనోహర కావ్యగుచ్ఛముల్
ముడిచితి నీదుకొప్పునను ముం దెటు నా భవితవ్యమున్నదో ?

కొమ్ముటేనుంగులన్ గెంటుకొనుచుఁ బోవు
కవులు విబుధులు వైమర్శిక ప్రవరులు
రసికు లెంద ఱుందురో మహారాజసభను
అండగా నుండ కీవు జయాశ గలదె?

ఆవులించినఁ బ్రేవులల్ల కెక్కించు క
ర్కశతర్కవాదవిక్రమము కొంత
తిమ్మిని బ్రహ్మిగాఁ దీర్చి దిద్దఁగలట్టి
శబ్దశాస్త్రార్థసౌష్ఠవము కొంత
విస్సన్న యన్నదే వేద మున్నటు చెల్లు
షడ్దర్శనమహాప్రసశస్తి కొంత
ఆడిన దాటగా నలవరింపఁగఁ జాలు
కైతలోఁ జాక చక్యంబు కొంత

ఎదిరిఁ గ్రక్కదలించు వాదీభసింహ
తాపటిష్ఠత యొకకొంత తనరఁజేసి
యింత దనుక శ్రీనాథుని కెదురు లేక
యలరఁజేసితి వమ్మ యో యజునికొమ్మ !

అనుచున్ దిగ్గన లేచు, నాల్గడుగు లల్లంతన్ వడిన్ వేయు, మె
ల్లనఁ జేవెల్గునఁ గాంచు వీధిదెస, నేలా యింతయాలస్య మం
చును బల్యంకికకై మహాతురతఁ గాంచున్, బ్రౌఢరాయక్షితీ
శుని కాశీస్సులువల్కు, డిండిమునిమెచ్చున్, గెల్పునాదేయనున్.

శస్త్రాశస్త్రిని దేలిపోవు బ్రదుకో చావో మహాస్థానిలో
శాస్త్రార్థక్రమబద్ధవాగ్రణములో సాగంగఁ బోదట్లుగా
నిస్త్రైగుణ్యులకేని వాదభయముల్ నెక్కోవె గె ల్పోటముల్
శాస్త్రే వాదభయ మ్మటన్ననుడి వాచారూఢి గాకుండునే ॥

నావలె నతఁడు నానాదేశసంచార
సమ్యగుపాత్తవిజ్ఞానఘనుఁడు
నావలె నతఁడు నానామహారాజసం
స్థానవిఖ్యాతవిశాలయశుఁడు
నావలె నతఁడు నానాశాస్త్ర పాండిత్య
శాండిమాక్రాంతదిగ్జయయుతుండు
నావలె నతఁడు నానామహాకావ్యని
ర్మాణచాతుర్యవిభ్రాజితుండు

నేను బ్రాహ్మీకటాక్షమానితతముండ
నతఁడు శంభుప్రసాదమానితతరుండు
చెలఁగి మాదగు విప్రతిషేధ మిప్పు
డెట్లు పరిణితి నందునో యెవరి కెఱుక,

వారక సద్వివాహము వివాదమునుం దమతోడఁ దుల్యులౌ
వారల కందగించుఁ, దగువాఁ డలడిండిమపండితుండె నా
కారయ నీ రణమ్మున జయమ్మును గొంటినయేని నిల్వవే
యారవితారకమ్ముగ యశోంగనతాండవపాండితీప్రభల్

కుళ్ళాయియును మహాకూర్పాస మందీయ
నన్యదృష్టిని వాని నచటె విడుచు
రత్నాంబరము లంగ రాగము లందీయ
నొకవైపుగా వాని నుజ్జగించు
గండపెండెరమును గవిపట్టి మందీయ
నొకమూల వాని నట్లుంచివైచు
సింహలలాటముల్ చిఱుగంట లందీయ
ముట్టి యవ్వానిఁ దా నట్టెయంచుఁ

దమిని వాదోపయుక్త సద్గ్రంథవితతిఁ
దెఱచుచుం జూచుచును సుంత తెఱపి లేక
యేదొ గొణుగుచు లోలోఁ దదేకదృష్టి
నాంధ్రనైషధకర్త పారాడుచుండు.

పాతంజలము విప్పి పరికించు నొకచోట
నొకసారి శేఖరయుక్తు లరయు
శాంకరభాష్యచర్చల నెంచు నొకచోట
శ్రౌతాసూత్రార్థవిస్తరము నరయు
వ్యుత్పత్తివాదము నొగిఁజూచు నొకచోట
ఖండనఖాద్యవాక్కలన నరయుఁ
కావ్యప్రకాశముఁ గొంచు నొక్కొకచోట
దండిభామహవాదతతుల నరయు

నలకవిత్రయసత్ప్రయోగాలిఁ దడవి
యెత్తు పై నెత్తు లెన్నెన్నొ యెంచి యుంచు
సకలవిద్యాసనాథుఁ డస్ఖలితవృత్తి
నలరి డిండిమ నోడింప నరుగువేళ.

డిండిమభట్టు నోడించి రాయల మన్న
నల నంది యొకవెల్గు వెలుఁగు టెపుడొ?
వేవిదంబుల నాదు విజయమ్ముగూర్చి స
భ్యులపొగడ్తల నందంబోలు టెపుడొ?
ఖండనమండనక్రమ మెంచి హర్షించు
కవిపండితులమెప్పుగాంచు టెపుడొ?
తతపరాజయమహాత్రపనను భుగ్నశిరస్కుఁ
డగుడిండిముని గాంచి యలరు టెపుడొ?

బహుకవీంద్రవాగ్బంధనప్రతిభఁ దనరు
కంచుఢక్కను బగిలింపఁగలుగు టెపుడొ?
దిగ్విజయగర్వమునఁ దలఁ ద్రిప్పు టెపుడొ?
అంబ శారద నాకోర్కు లరయు టెపుడొ?

పల్లకివేగములోఁ గన
యుల్లంబును బల్లవింప నూఁగాడుచు! దా
సల్లలితభావములఁ గవి
తల్లజు డుప్పొంగి యాశుధారలఁ గురిసెన్.

అంచితసత్కవీశ్వరుఁడ నంచు సభాస్థలి కెక్కినంతలో
నెంచుదు రెన్నొరీతుల సహించుట కావలె, నాయ మింత యో
జించుచు వారిశంకలకుఁ జిత్తము రంజల నుత్తరంబు క
ల్పించి వచింపఁగావలయు, లెక్కకురానివి త్రోయఁగావలెన్

మంచియు జెడ్డ లేక మడిమాన్యము లన్నియు మున్గినట్లుగాఁ
గొంచక దూఱువారల రగుల్కొనఁ గోపము వంచగావలెన్
మించిన మించనొప్పు, విరమించిన మించకయుండ నొప్పు, సా
రించిన యుక్తిబాణముల రేఁగుచు ఖండన సేయ నొప్పు భీ

ష్మించిన మౌన మూని కనమిన్ వినమిన్ బచరించి వాని నీ
డ్చించవలెన్ మహాత్ము లగుపెద్దలఁ బిన్నల గారవించి మ
న్నించవలెన్ నిరుక్తుల గణించి సయుక్తికవాదరీతిఁ జి
త్రించవలెన్ సభాసదులరీతుల నెప్పటికప్డు గాంచి గ
ర్జించవలెనన్ సభాపతులశీర్షము లెల్లను నల్ల నల్ల నూఁ
గించవలెనన్ సుహాస్యము లగించుచు బొందిక నాడ నాడ న
వ్వించవలెన్ శరించుప్రతివీరునిగుండెల గాల మౌచు నో
డించవలెన్ జనావళి వడిం గరతాళము లొక్కపెట్టు మ్రో
గించ జయాంకవాదము ముగింపగఁ జేయఁగదమ్మ భారతీ !

పల్లకి నల్ల డిగ్గి, వలె వాటుసడల్చుచుఁ కాలిపావలున్
మెల్లఁగ టక్కుటక్కున ధ్వనింపఁగ, చేచిఱుగంట మ్రోయఁ దా
నల్లన ఠీవిమై పదము లానుచు జంకెనవాడిచూపులే
తెల్లముగా సభాసదుల తీరులు దిద్దఁగనెంచె నిట్లుగన్.

ఇనుముం జల్లిన రాలకుండె సభ యెంతే నిర్వకల్ప స్థితిన్
ససిచక్కంగఁ బసిండిగద్దియను నాస్థానించె ఢేఁ, డాకడన్
రసికాగ్రేసరు లెవ్వరో? యిటుగ వీరమ్మన్యు లెవ్వారలో?
ఖుసిమీఱన్ ననుఁగాంతు రీడ నెవరెక్కో? డిండిముం డెక్కడో?

సకలవిద్యాసనాథుఁ డీసరణి రాఁగ
వాతచలితపద్మాకరప్రభ సభయ్యె
రండు దయచేయుడని ప్రౌఢరాయలనఁగ
కవియు ఠీవిగ బంగరుగద్దె నెక్కె.



# నారాయణభట్టు

నారాయణభట్టు రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి. నన్నయభట్టును, రాజరాజనరేంద్రుడు మహాభారతమును తెనిగించమని కోరుటలో ఈయన ప్రధాన పాత్రధారి అని నానుడి. ఈ సాహితీ సహచరుల మైత్రి ఏ విధముగా పరిమళించి పరిఢవిల్లినదో ఈ కవితా ఖండికలో దృశ్యమానము.



# నారాయణభట్టు

కవీన్మనీషాలవదుర్విదగ్ధాన్
మనోహరాభిర్మధు యుక్తి భిస్సదా
కుర్వన్న గర్వాన్ పటుభిర్విభర్మి
కవీభవజ్రాంకుశ నామసార్థమ్.

కర్ణాటకప్రాకృతసంస్కృతాంధ్ర
పైశాచికోక్తిప్రసరత్కవిత్వః
తద్వైభవోపార్జితదివ్యశక్తిః
వహామిచిహ్నాంకవిరాజశేఖరః

అష్టాదశావధారణసుచక్రవర్తీతిభూతవేఖ్యాతః
ప్రథితస్సరస్వతీకర్ణవతంసితిప్రకామమాంధ్రతవే.

సీ॥ మాన్యుడు యకలంకశంకనాత్యునికిని
సామెకాంబకు జనియించినాడ
శోభనాపస్తంబసూత్రుడ హరితస
గోత్రోద్భవ ఖ్యాతికొన్నవాడ,
నిత్యవైదికకర్మ నిరతుడ పావన
వానస ద్విజవంశ వర్ధనుండ
కళ్యాణ కటక నాగరకుండనై తొల్లి
మరలినాడను రాజమందిరికిని.

గీ॥ ఆత్మ నెయ్యరి నన్నయ యాదరింప
భారతామ్నాయ రచనానువాదమందు
అతనికొకకొంత ఆలమ్బుమైనవాడ
పరగువాడ నారాయణభట్టనంగ

సీ॥ లీల గైర్వాణిత్రిలింగావనిన్ పట్టు
పగ్గముల్ లేకుండ పఱగునాడు,
సామాన్య మానవజాతి కర్థముగాని
సంస్కృత గోష్ఠులుజరుగునాడు,
దేశభాషావాణి తెలుగునాటనురాజ
పోషణమ్ముల నంది పొదలు నాడు,
వైదికేతర మత ప్రాబల్య మాంధ్రుల
సంచితార్థము నాక్రమించునాడు.

గీ॥ ఆస్తికతతగ్గి దేశము నాస్తికతకు
దుందుడుకుతోడ పెడదార్లు త్రొక్కునాడు,
తహతహనుగుంది దిగులంది ధర్మసంప్ర
తిష్ఠకై రాజరాజు యత్నించు నాడు,
భారతాంధ్రీకృతికి నన్నయార్యు గోర
హెచ్చరించినవాడ నేనేగదయ్య

సీ॥ కూతునాతని ముద్దుకొమరున కొసగుచు
నన్నయతో వియ్యమన్ననాడు,
పంచమామ్నాయ శుభప్రసంగములందు
నన్నయతో గోష్ఠి నడుపునాడు,
వ్యాసభారతఘట్ట వైవేచనములందు
నన్నయ్యతో చర్చకొన్ననాడు
రసభావ బంధురార్థముల కైతలవేళ
బోసినవ్వుల నొల్కబోయునాడు

గీ॥ నన్నయయు నేను గౌతమీనదికి మునుగ
వేకువలలేచి జోడుగ వెడలు నాడు,
సాపడెడి వేళ వీటికాచర్వణముల
నెంత యుప్పొంగిపోతినో యెవరికెరుక?

సీ॥ సవిలాసరాణివాస ప్రసంగములందు
నన్నయలేని నేనున్నదెచట?
గడిదేరు పేరోలగపు మంతనమ్ముల
నే లేని నన్నయ నిలచెనెచట?
ఆనంద నగరవాహ్యాళి సందడులందు
నన్నయలేని నే నున్నదెచట?
రాజదర్బార్‌తీర్చి రహినొందు కొలువందు
నే లేని నన్నయ నిలిచెనెచట?

గీ॥ ప్రభుల శుభ శోభనము లందు త్రిభువనాంక
విద్య దగ్రేసర మహాకవీంద్ర సభల
ఱేడు విష్ణువర్ధనృపాల కరము కలిపి
నన్నయయు నేనులేనియేనాడు కలదు?

సీ॥ మంత్రినై త్రైలోక్యమల్లాధినాథుని
దిగ్విజయమ్ముల దేల్చినాడు,
అగ్రహారము లందియల రాణ్మహేంద్రుని
విద్వత్ప్రపూజల వెలసినాడ
పంచభాషా కవితాప్రౌఢిని వెలార్చి
కవిరసజ్ఞుల మెప్పుగాంచినాడ,
కలము ఖడ్గము నొక్కగడిలోన నడిపించి
వెలలేని సత్కీర్తి గాంచినాడ

గీ॥ ఆదికవి శబ్దశాసనునంతవాని
మన్ననలనాంధ్ర భారతామ్నాయమందు
పేరుకొనినాడ నాచంద్ర తారకముగ
నన్ను పిలిపింప వచ్చియున్నాడ నిటకు





# పండిత పరీక్ష

భోజ మహారాజు సంప్రార్ధనని సరస్వతీ దేవి తీర్చుట, కాళిదాసకవి ఉపజ్ఞా రెండు సూచితాలు. ఇది సంస్కృత చాటు ధారల మీద ఆధారపడినది. ఇది చరిత్ర కాదు. వాఙ్మయ ఖేలనం అని నా అభిప్రాయం.



# పండిత పరీక్ష

## (భోజ మహారాజు వాణిని సమీపించి)

మాలో మాకిట గల్గెనమ్మ జగదంబా! సందియం బొడు నీ
లీలావిభ్రమలోలచిత్తులము తల్లీ! మేము, ఈముప్పురం
దోలిం బండితుఁ డెవ్వఁడో కవి యెవండో నీవు వాకోవలెన్
మలౌల్యంబునుగాంచి నవ్వుకొనకమ్మా తల్లి! వాగ్దేవతా !

నిను నీదునలంకృతులను
అనులోమవిలోమగ తులయందములను స
ద్గుణగణలక్షణముల నె
నెమ్మిని జెప్పను దండికవిసుమీ యితఁ డంబా !

లలితపదప్రబంధము కలధ్వనిఁ దావకకాంచిఁ బోలఁగా
దలదరవిందశోభలఁ గధల్ భవదాననశోభఁ గూడఁగా
సులలితభావబంధురత చోద్యభవద్భృగపాంగ మంటఁగా
మలచె నితండు తద్దశకుమారచరిత్రము హృద్యపద్ధతిన్.

వీరరసప్రధానపదవీనదవీయసిగా నొకండు శృం
గారరసప్రదీప్త కలకంఠకుహూకృతిగా మఱొండునున్
తీరిచి రూపకమ్ము లిరుతెన్నుల మిన్నులుముట్టి యున్నయీ
భూరిఘృణార్ద్రచిత్తు భవభూతిని గాంచుమి నిల్చె నియ్యెడన్.

ముచ్చటమూడు శ్రవ్యములుముద్దులుగొల్పెడి మూడుదృశ్యము
ల్గుచ్చి భవద్గళమ్మునకుఁ గూర్చినవాఁ డొకకావ్యమాల, నిన్
మెచ్చి యజించువాఁ డుపమనే వరియించిన కాళిదాసు నీ
యిచ్చ నెఱుంగవచ్చెనుగదే జననీ ! యిఁక నిర్ణ యింపుమా!

కావ్యము శివేతరక్షతి కారణముగ
ధర్మబోధకముగను నందఱికి విన్న
మాత్ర నిర్వృతి గూర్ప ముమ్మాటికిని ర
చించియున్నారు వీరు నీసేవకు లయి.

యుగాయుగలకునే వీరియూహలను సు
బోధ లాదర్శములు మొక్కపోక నిలుచు
నీవు లోదృష్టిఁ దత్త్వపరీక్షసలిపి
నెఱుపుమా కవిపండితనిర్ణయమ్ము.

తావకనిర్ణయంబు దలఁదాల్చుచు నే నవలం గురుత్వసం
భావనతో కవీంద్రుల సభాజనసల్పుదు, నీప్రపంచమం
దావహిలుం బ్రశస్తి జగదంబ ! దయారసధారచిల్కువా
చావసరంబు గల్గెఁబలుకాడవె యంచును భోజుఁడాడఁగన్.

దండిమహాకవీంద్రునివిధం బది లోకమెఱుంగుఁబో, మహా
త్ముండును బండితుండు భవభూతిని గూరిచి చెప్పనేల? వా
క్పాండితి కిద్దరిద్దరె జగన్నుతు లంచుఁ దటస్థవృత్తితో
నుండఁగఁ గొంతయాగి యను నోహరిసాహరి కాళిదాసుఁడున్.

అతఁడు పండితుండును, మహాకతి యీతఁ డటంచుఁ బల్కి నీ
ప్రీతి వెలార్చి తేనెవఁడనే విరిబోఁడి! యటంచు కాళిదా
సాతతకోపవేగమున నాడఁగ, దాని గ్రహించి యప్పుడా
మాత “త్వమేవ చాహ” మని మన్ననఁ బల్కె నభేదదృష్టితో.

కోహ మటన్న తర్జన కకుంఠితవత్సలదృష్టితో “త్వమే
వాహ మహం త్వమేవ” అని యాడితి, వాతఁడు నీకు వట్టిదా
సోహము చేయనా యిది? దయార్ద్రతఁజూపినపక్షపాతమా?
సాహస మద్ది, నాకతడు సాహితిఁ బాండితిఁ గైత సాటియే?

ఇంతకుఁ గొంతగర్వమున నెత్తినశీర్షము వంచుకొంటి లోఁ
బంత మణించి, నీదుపదపద్మము లంటి వచింతు, నంబ! నా
యంతటివాఁడె యీత? డటులైనఁ దదీయకవిత్వరీతు లెం
తెంతలో నాదువాక్ఫణితు లెంతలో తేల్చు తులానిబద్ధతన్.

అంచు భవభూతి పల్క నాయంబ లోన
శిష్యవాత్సల్య మొకకొంత చిందులాడఁ
జొక్కి భవభూతికాళిదాసుల కవిత్వ
ఫలితులను దూప నెంచి చేపట్టె ధటను.

బిడ్డ ! యేలయ్య యీవెట్టిబింక మిట్టు
లెవరిసంస్కారములు వారి వెన్న నేల?
తారతమ్యము లస్మత్సదాకటాక్ష
విలసనమ్ములై కవులకు వెలయుఁగాదె.

కవితా సత్కృషియందు మీకు సము లెక్కాలాన లేరన్నచో
నవునౌ నంచుఁ బ్రహర్ష మందినదిగాదా లోకమే ముగ్ధమై
తవునయ్యా యిది మిమ్ముబోటులకు? మీదన్మీద నీధాత్రిపై
కవులం దీరస మిట్టు లుండు ననుధిక్కారంబె నిల్చుంగదా !

అనెనావాక్సతి; యేమిటం దడవనీ. యోఁగాము లెట్లుండనీ
జననీ ! మాకిది తేల్చుకోఁదగిన; దీర్ష్యాసూయ లిందుండవం
చును బల్కన్ భవభూతి; అంబతులయంచుల్ మోవగా వారివా
క్ఫణుతుల్ తూచెను; కాళిదాసకవితాభారంబు తోరంబుగన్.

దానిని సహింపలేక గైర్వాణి యపుడు
కాంచి దయనెంచి భవభూతికై తయందు
చెవిఁ జెరివికొన్నయట్టి చెందొవను దివిచి
తన్మధూలిని పూర్తికై దానఁజిలికె.

అంతర్హితముగ వాణి త
నంతనె యటు సామసింప నదిగని యెదలో
చింతయుఁ బంతము గొని, వా
క్కాతం గని కాళిదాసకవి యిట్లనియెన్

అమ్మా! ఎంతటిప్రేమరాశివిగదమ్మా ! భక్తవాత్సల్యమున్
నెమ్మిం జూపి మాధూళిఁ జిమ్మి యతనిం గెల్పింతువే? నీకటా
క్షమ్ముం బొందినయాతడే గెలువనీ, కాకేమి. నేనోడనీ
వమ్మా! యేమిట హెచ్చులొచ్చు? లిదె నాకత్యంతసమ్మానమౌ.

ఇలలో మామకై తలఁ
దులనిడి వాక్సతియె తూఁచెఁ దొరపుఁబెరిమన్
గెలిపించె భక్తు ననియెడి
పలుకులు కలకాల మంట భాగ్యముకాదే?

ఈనీధర్మపరీక్షలోన నిఁక నాదేకాదె పై చేయి – పై
పై నీసత్కవిపక్షపాతమది యబ్బా ! అందదే యూహకున్
వాణీ! మెప్పుల కేమిలే? ప్రభువులం బ్రార్తింతు, నాస్థానిలో
నేనాఁడున్ కవులందు భేదములు రానీకుండ మన్నింపవే.

అని వెడలిరి, రాజాస్తా
నిని బెద్దఁగ కాళిదాసు నిలిచెను, కాలం
బును గొంత జరుగ నొకరచ
నను భవభూతికవి గూర్చి నమ్రతఁ బలికెన్.

నవనవబంధపూర్ణ కరుణామయి ముత్తరరామగాధ నా
కవనము, కాళిదాసకవికర్ణ రసాయనముం బొనర్చి త
త్సవిధమునం బఠింపు మొకసారి, మహాకవి మొచ్చుకొన్నచో
దవునిది వాక్ప్రపంచమునఁ దప్పిన నాహుతి కృష్ణవర్త్మకున్.

పుంభావసరస్వతిగా
సంభావనసేసి యాత్మసదృశత నెఱపెన్
గంభీరభావ ! భారతి
డింభక ! యీకావ్యమట పఠింపగ పొమ్మా !

రాలుం గన్నుల నీరునింపికొన వజ్రాలున్ వ్యధాభుగ్నతన్
గూలం గుండెలు బ్రద్దలై, సరసవాగ్గుంభంబుతోఁ జెప్పితిన్
నేల న్నాసహధర్మి యెప్పటికి నేనిం బుట్టఁడే మెచ్చఁడే ?
కాలం బెన్నఁగ మేరలేనిదియు భూఖండం బపారంబునున్.

అని యుత్తరరామచరి
త్రను వ్రాసిన తాళపత్రతతి నొసఁగుచుఁ బం
చిన చదరంగపుటాటం
దున నున్నమహాకవిం గనుంగొని యుతఁడున్.

సామీ! నే భవభూతిశిష్యుఁడను దృశ్యంబొండు విన్పించి మీ
ప్రామాణ్యంబును బొందఁగోరి గురుఁడంపన్ వచ్చి, తీకావ్యమున్
రామోదంతము నుత్తరార్థకథగా రాణించు, సెల్వైనచో
ఆమీదం బఠియింతు నన్నఁగని, అట్లా? అంచు నిట్టూర్చుచున్.

ఇది భవభూతిపండితకవీంద్రునికావ్యమటో అటైనచో
మొదలిడుమంచు నాకుమడుపుల్ పనికత్తెయిడన్ గ్రహించుచున్
అదనుల దానితోఁ బలుకులాడుచు నాటఁ దదేకదృష్టితో
తుదివరకు న్నయించె నెటనో యొకపట్టున లో గొణంగుచున్.

వాచకుని బంపివైవఁగ
నాచతురుఁడు గురునిజేరి యనె నీరీతిన్
చీచీ క్రీడాలోలుఁడు
వాచింపఁగ నన్ను బలిచి పంపితి రటకున్.

అనరా దట్లు మహాత్ముల
పనులు చరిత్రమ్ము లల్పభాగ్యుల కవగా
హనములుకా; వింతకు నీ
పని నెఱవేర్చితివో లేదో పలుకుము మొదటన్.

వినిచితి నే యీకావ్యము?
వినెనా శ్రద్ధగ నంతండు, విని యేమేఁ దా
ననెనా? అని యడుగఁగఁ జ
ట్టనె, నేదో శ్లోక మొక్క డనుచుండంగన్.

సున్నం బెక్కుడు సున్న మెక్కుడని యంచున్ దాసితోఁబుల్కుచున్
నన్నుం జూచెను, దాసి నవ్వె, నిదియేనా లక్షణం బన్న ? మీ
కన్నన్ వానికి శృంగముల్ మొలిచెనే? కావ్యార్థనిర్ణేత వీఁ
డన్నన్ నవ్వరె య్యెవ్వరేనియును వాచారంభ మికేటికిన్?

ఆకుమడుపులలో సున్న మధికమయ్యె
నో? కవిత్వపద్యమ్మునో యదేమి
యర్థమే నాకుఁగాక యిట్లనఁగవలసె
నెఱసు నాయందు గలుగ మన్నింపవలయు.

అన్నాడా యటు సున్నమెక్కు డని? ఆహా! దీన దోసమ్ములే
కున్న న్వాకొనఁడట్టు లయ్యెదియు నేదో తేలదే, కావ్యమున్
మిన్నుల్ముట్టు నటంచు నెంచితినికానీ దీని దుర్యోగ మీ
తెన్నుం బట్టెను, వహ్ని కాహుతి నివేదింతున్ ప్రదోషంబునన్.

ఒక్కొకపద్యబంధమున కొక్కొక నెత్తురుచుక్క పిండి పెం
పెక్కినదీక్షతోడఁ దను వెండఁగ, ఈకరుణాగృతిన్
మక్కువతో రచించి తిది మాకు చిరస్థితి కూర్చునంచు, నే
ఫక్కిని ద్రొక్కినం గవిసభాజన మందుట కష్టమేగదా!

కావ్యమున్విని రసిక శేఖరులు మెచ్చ
కున్నచో గతి దానికి నుదధియొకడె.
ఎంతగురుశిక్ష నందిన నేమిఫలము?
తనకుఁ దనపై హుళక్కి ప్రత్యయము కవికి.

అని యాకునాకుఁ జదువుచుఁ
గనుఁగవ నశ్రువులు దరఁగఁగా జ్వలనమునం
దున వేల్చెఁ గావ్య మంతయుఁ
దనకావ్యముతోడఁ దాను దాపితుఁ డగుచున్.

కాలము గతింపఁ గొంత యీకథయు వడిగ
నడచె నానోట నానోట నగమందు
కాళిదాసుచెవిం బడె కవులు వినిరి
ఆలకించుచు ఱేఁడుఁ దాపార్తుఁ డయ్యె.

"తీరిచిదిద్దె నాతఁడు కృతిన్ రసపూర్ణ సుధాస్రవంతిగాఁ
జేరిచె నద్భుతార్థపరిశీలిఘట్టము లందు, ముద్దుగా
గూరిచె భావసందప నకుంఠితమాధురి శబ్దబంధసం
స్కారముతో; మఱేడ నపశబ్ద మపశ్రుథజ యుప్పతిల్లెనో?

తగనికార్పణ్య మీకాలిదాసకవికి
కవికి వాణి పరీక్ష శృంగముల నొసఁగెఁ
గాన, లోటులా భవభూతికై తయందు ?
అంతమాత్రాన కావ్యదాహంబ ! అకట.

దివ్యసుందరిసౌవర్ణ దేహమందు
చిన్నస్విత్రము శోభను చెఱచినటులు
సకలగుణరసాలంకారసహితమయ్యుఁ
గావ్య మపశబ్దమున నపకర్ష సెందు.

భావనాబల మాస్తికత్వప్రసక్తి
శుచియు దక్షత పూర్ణవాక్శుద్ధి గలుగు
అంతవాఁ డింతచేయుట అక్కటకట !
బుద్ధి పెడతలపట్టుటపో తలంప"

లోకులు కాకు లీవరుస లోటులు దబ్బర లాడిపోయఁ జీ
కాకునఁ గాళిదాసు తనగౌరవభావముఁ జాట ఠేనితో
ప్రాకటరీతి నొక్కకవిపండితసత్సభ నేర్పరించెఁ దా
నేకడ సున్న మెక్కుడని యెంచెనొ యక్కడ వ్యాఖ్యసేయుచున్

"కిమపి కిమపి మందం మంద మాసత్తి యోగా
దవిరళితకపోలం జల్పతోరక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రి రేవం వ్యరంసీత్.

ఏ దేదో మెలమెల్లఁ జెక్కిళుల నెంతే దగ్గరం జేర్చి సం
వాద మ్మొక్కక్రమంబు లేక సడలింపన్ రానికౌగిండ్లతో
తాదాత్మ్యంబున సల్ప యామములయాతంబేని గుర్తింప కెం
తే దబ్బాటుగ రాత్రియే గడచిపోయెన్ తెల్లవారన్ దెసల్."

"రాత్రి రేవం, అనుటకన్న రాత్రిరేవ
అనుటలోఁ గలదయ్య కొండంత సొగసు
సూచనామాత్రఁ దాము నొచ్చుకొని, కావ్య
దహన మొనరింతురంచు నేఁ దలఁపలేదు.

విని యాసత్క విభాష్యమున్ సుకవు లావిర్భూతరోమాంచులై
యనిదంపూర్వము తన్మహాప్రతిభ యం చాడన్ సభాస్తారులె
ల్లను గైమోడ్పులొసంగ, మెచ్చుకొనరారాజున్కవీంద్రద్వయం
బును నాశ్లేషసుఖంబు నందె, సభ నమ్మోదాబ్ధి నోలాడఁగన్.

అగ్నిసాత్కృతి యాకృతి యైనకతనఁ
బొగులుచుండె లోలో భవభూతి, యప్పు
డొక్కకంట నవ్వుచును వేఱొక్కకంట
నేడ్చునతనికిఁ గాళిదా సిట్టు లనియె.

తూచాతప్పక మీమహాకృతిని నెంతో శ్రద్ధతో వింటి, మీ
ధీచాతుర్యము తత్కృతి న్మెరసెఁగాదే వేదలల్ దన్ని: మీ
రాచామించితిరయ్య తత్కళ మహాత్మా! ఐన దయ్యెన్ భవ
ద్వాచారీతులు తప్పకుండఁ గృతిఁ జెప్పంజూతు, వ్రాయింపుఁడీ.

అనుచు నుత్తరరామదృశ్యమును ససిగ
తా 'నితిశ్రీ, గ నప్పగింతలను బెట్టి
ముద్దినంబుల కాకృతిం బూర్తిచేసె
భూమి నిటు నిల్చె నుత్తరరామచరిత.

ఇది జనశ్రుతిం జాటూక్తు లెన్ని కొన్ని
వ్రాసినది; యిది యిట్లు సంభవమ కాద?
ఒప్పుకొనునా చరిత్ర? అంచూహ వలదు
వాఙ్మయపుఖేలనములు గావచ్చు నివ్వి.



# కాళిదాస కవి

మహాకవి కాళిదాసులో కవిత పరవళ్ళు త్రొక్కింది. అంతవాని ఛాయాచిత్రమే లేకుండా చేసికొన్నామే అనే బాధతో ప్రారంభమీ కవిత. కవి ఎంత ప్రతిభాశాలియైనా వినమ్రత కావాలి అనే నీతి సూచితం– "నా సృషిః కురుతే కావ్యమ్" అని కదా నానుడి.



# కాళిదాసకవి

కావ్యదర్పణమందు సంక్రాంతమైన
భావనారూపమే మంచిపటిమ గలది
చెదలుపట్టదు, మాయదు, చినిగిపోదు
కాంతు మీరీతి నిను మహాకవివరేణ్య.

మునిపల్లె లాశ్రమంబులను వర్ణించుచో
మౌనిముద్రలు మాకుఁ గానిపించు
ధర్మప్రబోధామృతమ్ము చిన్కెడివేళ
అసమమహర్షి చిహ్నములు దోఁచు
సాంసారికపు మర్మసారమ్ము లనువేళ
పండినసంసారివలెనె దోఁచు
అద్భుతకల్పనానల్పజల్పనముల
నవసరస్వతి యనఁగఁ దోఁచు

అమల శాస్త్రీయసంప్రదాయములు పలుకు
వేళ పండితదిగ్దంతివిధము తోఁచు
వననదీగిరివర్ణ నావసరములును
తెలియు దీవొక దీర్ఘయాత్రికునిపగిది.

వైదికపుసంప్రదాయముల్ భారతీయ
విపులసంస్కృతి నేకీభవింపఁజేసి
ధర్మ్యముగను గాంతాసమ్మితమ్ముగా సు
కావ్యనిర్మాణ మొనరించు ఘనుడ నీవు

నీతల్లిదండ్రు లెవ్వరొ? మనీషి వెటైతివొ? ధర్మపత్ని నీ
కేతరుణీలలామయొ? జనించెనొకో మగమొల్క? పుట్టువే
భూతలినో? యవన్ని యును పూజ్యభవత్కృతులందుఁబూజ్యమో
పూతచరిత్ర? నీవొక యపూర్వనిరీహునిరీతిఁ దోఁచెడిన్.

విక్రమార్కు సంస్థాన కవిప్రపత్తి ఁ
గలితనవరత్న ములలో నొకండ వైతొ?
భోజకవిరాజ నాస్థానమున వసించి
ఘనత గాంచితివో చెప్పఁగల రెవారు?

కుక్షికి లేక నిన్గలిసి కోరికి చెప్పి కవిత్వ మల్లి నీ
భిక్షగ భోజరాజుకడు విస్తృతగౌరవ మందుకొంచుఁ దా
మక్షరలక్ష లందినమహామహు లెవ్వరయేని గల్గుచో
సాక్షిగ సత్యముం బలుకఁజాలుదురేమొ భవచ్చరిత్రముల్

గైర్వాణి నేర్చుకోగల్గుచో నీరఘు
వంశమే ప్రథమసోపాన మయ్యె
పదశావవిదులకు భవ్యకుమారసం
భవమే ద్వితీయసోపాన మయ్యె
అకలంకరసవేత్తలకు మేఘదూతకా
వ్యంబు తృతీయసోపాన మయ్యె
నాట్యవేత్తలకు నీనాటకత్రయము ది
వ్యంబు చతుర్ధసోపాన మయ్యె

ఇట్లు సకలకలార్థుల కెలమి మిగుల
పరమసంస్కృతసాహిత్యభవనమునకు
నెట్టి విజ్ఞానభిక్షనను బెట్టుచుండె
నీసరస్వతి యీనాట నేఁటి దనుక.

గురుభక్తి పితృభక్తి పరలోకసుస్థితి
మాటిమాటికిఁగైత మలచినావు
ఘనసతీత్వమ్ము స్త్రీగౌరవాతిశయమ్ము
చిత్త జల్లుగఁ గైతఁ జెప్పినావు
యజ్ఞయాగములు మహర్షు లాశ్రమముల
టన్న గౌరవము వెలార్చినావు
దేశనదీరాజదివ్యచరిత్రలు
చెప్పి లోకజ్ఞత మప్పినావు

తతదయాసత్యశౌచపద్ధతులు విడక
జనత క్షేమంకరప్రక్రియను వసింప
చేసితివి నీదువాగ్రత్న చయముకలన
ధర్మమును జూటినట్టియుత్త మకవీంద్ర !

చాకచక్యముగా ప్రతిశ్లోకమందు
ఎదకు హత్తెడిరీతి నన్నెన్నొ చోట్ల
ఉత్తమోపమములను వాడియుండి, నీవు
మాత్ర మనుపమానుఁడ వైతి మాన్యచరిత!

త్వత్కవిత్వములో జడప్రకృతిగూడ
కంట తడివెట్టు, చిచ్చుఁ, జక్కఁగను బల్కు
దీపశిఖ యంద్రు నిన్ను దేదీప్యమాన
కాంతి లోకుల కిడినసత్కవివరేణ్యా !

అచ్చటలు ముచ్చటలకు మీయాలుమగలు
పెంచుకొన్నారటో ఆడుబిడ్డ నొకతె?
దబ్బరైనచో నాశకుంతలకుఁ గఱపు
కన్నులు చెమర్చుబోధ లెక్కడివి తండ్రి?

తీరుల్‌మీఱ రసజ్ఞ శేఖరుల కెంతే మెప్పులౌ నీదుశృం
గారచ్ఛాయలకై తలం గని వృధాగా నిన్ను 'శృంగారి, యం
డ్రారీతిం దగు వీరఘట్టముల నాహ్లాదంబునం గాంచి నిన్
వీరుండం చనరేమి? నోళులవి యేవీలున్న నట్లాడవే?

గుండెల నండలండలుగఁ గూల్చెడి యాయజరాజరోదనా
ఖండ మహాబ్ధికిన్, స్మరునికై రతి పొందిన యేడ్పుటేటికిన్,
దండుగు లడ్డుకట్లు, బెడదన్ విదిలింపవె ఱాతిగుండె బల్
మొండినినేని? యాఘృణయపూర్వముగాఁ బరవళ్ళుత్రొక్క దే?

ప్రకరణవక్రతల్ గలుగుపట్టుల పాత్రలభాషణమ్ములన్
వికృతులు వైపరీత్యము లనిందితరీతిని దీర్చుచున్ బురా
ణకమగుగాథకున్ మెఱుఁగు నాణ్యత లౌకికసిద్ధిఁ గూర్చి యా
ప్రకట శకుంతలాకథకు ప్రాణముపోసితి వోమహాకవీ!

అటనట కావ్యఘట్టములయందు లగించిన నాట్యగాన సం
ఘటనలు సాంఖ్యయోగము లగాధవువైదికధర్మశాస్త్రముల్
పటుతర శబ్దశాస్త్రపరిభాషలు జ్యోతిషతత్త్వశాస్త్రపుం
గిటుకులు నాయురాగమ వినిర్ణయముల్ గన దిగ్భ్రమంబగున్.

ఒక సమ్మోహనశక్తి యయ్యదియెదో ఊహింపఁగా లేను నీ
సుకవిత్వంబు పఠించువేళల మనస్సుంజాలివెట్టున్ సము
త్సుకతన్ గుండెల జల్లఁజేయు, నుడుకెత్తున్, చీల్చి చెండాడు న
య్యకలంకం బగుశక్తి శబ్దగతమయ్యా? అర్ధసంబంధమా?

ప్రతిదళసార్థకత్వము విభాసిలగా, శ్రుతిసిద్ధతత్త్వస
న్నుతి నుతులం దొలంకఁగ, మనోహరసద్ధ్వనిరీతు లెల్లెడన్
కుతుకముగూర్ప నీకవిత కోమలమై యలపుట్టపుట్టువున్
స్మృతిపథమందు నిల్పు, తరమే యటు లాడ వసంతశోభలన్

ఏఁడులుపూడులున్ యుగములేని గతింప గతింపనిమ్ము నీ
వాడికవిత్వమూర్తి కిఁక వార్ధక మంటదు, సర్వభాషలన్
పోడిమి నీకృతుల్ పరమపూజ్యములై పరివృత్తి నందె నీ
కీడు కవిప్రపంచమున నెవ్వరయా? సురవాగ్వశంకరా!

నీరసవత్క విత్వసరిణిష్ఠితపూర్ణభరం బెఱింగి యా
భారతియే భవత్ఫణితిపై నొకగుఱ్ఱ వహించెనందు రా
శారదసత్పరీక్షయె నిజంబుగ మేటికిరీటమౌచు నీ
కారణజన్మసంగతి జగంబుల నెల్లెడ మ్రోఁగఁజేయదే?

తటకునఁ జూచిరాఁదగినతా వది కాదు హిమాద్రి, యెప్పు
వెటు లట కేఁగి కాంచితి విసీ! కనకుండగ నట్లు చెప్పఁగా
పటు వెవడయ్య ? నేడు పలుపాటుల నచ్చట చేర నేర రే!
కటకట! బుద్ధి బుద్ధి, రవి గాననిచో కవి గాంచునే కదా!

అబ్బురపుంగధానికల నల్లిరి నిన్ను గుఱించి రక్తి యా
గుబ్బుకొనంగ, నంతటియకుంఠితశక్తులు నీకుఁ గల్గునో
దబ్బరలో యటన్న పరితాపము లోకుల కెందుకోసమో
నిబ్బర మైన కాళికృప నీకులభింప మహాకవీశ్వరా!

కోహ మటన్నతర్జన కకుంఠితవత్సలదృష్టితో "త్వమే
వాహ మహంత్వమేవ", అని యాడెన టాజగదంబ, సత్య
సాహస మేమి యిందు? సరసార్ద్రకవిత్వసుధామరందసం
దోహివి నీకు నియ్యది సదుత్తరమే సుకవీ! లసద్గవీ!

ప్రజ్ఞాచక్షువుతో సమస్తమును సంభావించి గైర్వాణిలో
విజ్ఞుల్ గూడ వచింపలేని కవితావేశమ్ముతో వ్రాసి మా
యజ్ఞానోగ్రతమస్సు లార్పితివికాదా? భావనాతీత! స
ర్వజ్ఞా! భారతభూమి నీ ఋణము దీర్పంజాల దేనాటికిన్.

కాళికాలోలదృక్కేళికావిలోల
డోలికాఖేలనాసక్త బాలకుడవు;
మందుడ నటంచు నీవొక్కమాట పలికి
ఎంతటివినమ్రతను ప్రకటించుకొంటి?



# నన్నయ భట్టు

ఆదికవి నన్నయ్య, నారాయణభట్టు, రాజరాజనరేంద్రుని ఆస్థాన కవి దిగ్గజాలు వారి రూపురేఖాచిత్రాలు లేవు. కవి వారి ఆకారాలు ఎలా ఉంటాయి అని నిత్యము వారిని స్నానమాడించే గౌతమినదిని అడుగుతాడు. ఇందుకవి ఉపజ్ఞయు, భారత కవితా ప్రౌడి సూచితాలు.



# నన్నయభట్టు

కవియున్ వ్యాకృతి తెల్గుకైతయు సత్కావ్యమ్మును న్మందుకే
నవభాసింపని వేళ, ఆంధ్రభువి నృత్యం బాడుగైర్వాణి పెం
పివతాళించెడి వేళ నాంధ్రి కొక ప్రత్యేకత్వముంగూర్చి, నిం
పవె నీ భారతవాణి వాణి తలయూపన్ దెల్గున న్నన్నయా !

ఆదికవిప్రశస్తి జయ మందితి, నీకృతి యాదికావ్యమై
మేదురమయ్యె వ్యాకృతియు మించెను దొల్తటిదై, యిటన్నిటిన్
బ్రోది యొనర్చి, యాజివయి పూజ్యత మించుచు రాజరాజుచే,
ఆదికవీంద్రుఁ డైతివిగదయ్య మహామహ! నన్న పార్యుఁడా !

లోకులు కాకులై పరమలోలత నన్యమతానురక్తిఁ జీ
కాకులఁగూఁకునాఁడు సరిగాఁ బొడఁగట్టక వేదధర్మపుం
దేఁకువ లింకునాఁడు పరిదేవన మందెడిరాజరాజ వీ
క్షాకలనమ్ముతో మనసు కల్పి తెనుంగున వ్యాసభారత
ప్రాకటధర్మతత్త్వములఁ బల్కవె? యాంధ్రుల చీఁకు వాపవే?

నీనుడికారవుంబసలు నీయొడికంపుసమానపద్ధతుల్
తేనెలసోవలం గురియుఁ దీదనంపు ధ్వనిప్రసక్తినీ
నానుడు లుల్లసిల్లుఁ, బరిణామభిదేళిమదాళిమీఫలా
సూనరసాతిగుంఫితవినూతన పక్కిక నీది నన్నయా !

తీరిచిదిద్దియుంటి గడిదేరినయౌచితిన్ లగించి నీ ,
భారతపాత్రలన్ శ్రుతికిఁ పండు వొనర్చుప్రసంగసంగతిన్
నీరచనావిధానపరిణిష్ఠితమోహనశక్తి యేదొ, మ
మ్మారసవత్ప్రపంచగగనాంతరసీమల నోలలార్చెడిన్.

భావించి యవ్యాసభట్టారకునెడంద
పట్టిచూపించు నీప్రౌఢతనము
సరసప్రసంగ ప్రసన్న కథా కలి
తార్థయుక్తి వెలార్చునట్టి నేర్పు
తీరు తీయముల నానారుచిరార్థ సూ
క్తి నిధిత్వ మట్టై చూపిన బెడంగు
శ్రవణపేయముగ నక్షరరమ్యతను గ్రుమ్మ
రించి మించిన నీవరిష్ఠశక్తి

వాఙ్మయ ధురంధరుఁడు సహపాఠి సాయ
పడినవాఁడు నారాయణభ ట్టటంచు
అతని నారాయణునిపోల్కి నాడియున్న
నీదు స్నేహార్ద్ర వృత్తి వర్ణింపఁదరమె?

మును విద్యాదయితుండునున్ సుమహితాత్ముండంచు నీభారతం
బును వేమాఱు పఠించి చొక్కి యనెనేమో యాకవిబ్రహ్మ తి
క్కన నిన్గూరిచి; యవ్వలన్ సరసవాక్సంరంభగంభీరుఁడై
చనె నీయడ్గులజాడ పట్టుకొని నీజన్మంబు సామాన్యమే?

సక్రమపద్ధతిం దెలుగు సాగుటుకై యొడుపైనతత్సమ
ప్రక్రియ గూర్చి యాయమరభాషను దెల్గునఁ జొన్పినావు ని
ర్వక్రపుసూత్ర ఫక్కికను, వాగనుశాసకుఁ డన్న పేరు భూ
చక్రమునందు నిల్చి నిను జాటదె వ్యాకృతి సీకృతింబలెన్.

అతిలోకాద్భుత వేదవాదయుతధర్మాఖ్యాన మైయున్న నీ
కృతితోపాటుగ రాజరాజును గృతార్థీభూతుఁ గావించి సు
స్తితి నీవందితి రాణ్మహేంద్రనగరీస్థేమాభిరామాకృతిన్
కృతిచే రాజులు రాజధానులు కవుల్ కీర్తిన్ ధర న్నిల్వరే?

మజ్జనవేళఁ బల్కునఘమర్ష ణఋుక్కుల సుస్వరమ్ముతో
త్వజ్జలభంగసంగతరవంబున వల్లెలు వెట్టుకొందు; నీ
పజ్జల దోఁగవచ్చు ననపార్యుడు నాతనిమిత్రుఁడున్; నిమ
జ్జజ్జనపావనీ; తదుపసర్పణసంపద కెంతనోచితో?

హాయిఁ దరంగహస్తముల నానిచి నిత్యము మున్గవచ్చు నా
రాయణభట్టుతోననపార్యుని బిగ్గఁగవుంగిలించి యా
ప్యాయిత వైతిగాదె శఫరాక్షి! తదాకృతు లెట్టివౌనొ మా
కీయెడ వ్రాసి చూపగలవే కనువిందుగ వృద్ధగౌతమీ?

చవి చవియున్, పసం దయినక్షారము సారపుధర్మజాల, మా
యవకలు లావ, వృత్తములు నక్కఱలన్యములాత్రమఖండముల్
ప్రవిమలతైల మారుచిరభావపరంపర, క్రొత్తయావకా
యవలెను మాటలూర్చి సకలాంధ్రుల నీకృతి తన్పునన్నయా!



# మా కళాశాల

విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా స్వర్ణోత్సవ సందర్భమున, ఈ పద్యములు చదువుబడినవి.



# మా కళాశాల

ఉ॥ నీవొక జ్ఞానదీపికవు, నీయెదలోపలి దివ్యకాంతియే
కోవిదవర్గమెల్లను, నకుంఠితతేజమునన్ వెలుంగు నీ
పావనమూర్తినుండి జనిభాగ్యము నందిన ఛాత్రదీపికల్
ఈవర కెన్నికోటులో? హరింపఁగ లోకతమంబు నెల్లడన్॥

ఉ॥ నీవొక పుణ్యమాతృకవు, నీదుసుతుల్ కమనీయసత్క ళా
జీవనులైన ఛాత్రులు, విష్టవరిష్ఠ పటిష్ఠ పాండితీ
పావితశిష్యలోకులగు పండితవర్యులు నీకు బందుగుల్
ఈ విజయాధినాధునికి నింపులునింపెడు బిడ్డ వీవెగా॥

ఉ॥ నీవు కళాధినాధుడవు, నీవరసుస్థిర రూపమందునన్
లేవు కళంకముల్, పరమనిర్మలమైన ప్రవృత్తి యందునన్
లే వపరాధముల్, కనగలేమిట తగ్గులభావముల్, సుహృ
ద్భావమె చూపుచుంటివిగదా! అలశిష్యహృదబ్దపాళివై ॥

ఉ॥ నీవొక నాకనందినివి, నీదుపవిత్ర శరీరవాసులౌ
దేవత లేను పండితులు, దీపితశాస్త్రచతుష్టయంబె, నీ
పావన సుప్తనంబు, లల వత్సలు వత్సములేను, పెంచుచు
న్నావిక జ్ఞానదుగ్ధమిడి నవ్యకళాకలనమ్ము మించగన్ ॥

ఉ॥ ఈవు ఘనాఘనంబవుగదే, సకలాగమ తత్త్వశాస్త్ర బీ
జావలి మోసులెత్తగ, కళాత్మకవిద్యుదుపేతవై, మహా
జీవనబోధవృష్టివిడి, శిష్యసుసస్య సమృద్ధిగూర్చుచు
న్నావు నిరంతరమ్ము పఠనక్రమ గర్జనముల్ సెలంగగన్॥

ఉ॥ నీవొక సద్గురుండవొ? మనీషివో? సర్వకళా స్వరూప త
జ్జీవితగాధలందెలుపు జీవనమూర్తివో? శిష్యవర్గమున్
భావిశుభోదయప్రచుర పావనమార్గములందు నిల్ప దీ
క్షావహమైన కంకణముకట్టిన ధన్యుడవౌదువో కదా॥

ఉ॥ అరువది వత్సరమ్ముల వయస్సునునెట్టిన యోసువాసినీ
తరుణి! కళానికేతనమ! తప్పక తెల్పుగదమ్మ! ఎందరెం
దరు భవదీయసూక్తుల గృతార్థతనందిరొ, నీదుబోధ యెం
దరికిల జీవనౌషధివిధమ్మున గోర్కెలపంట పండెనో॥

గీ॥ ఆశ్రిత హృదాలవాల విన్యస్తమైన తావకకళావిలాస సంతానవల్లి
అలమెను విదిగ్దిశాంతనితాంతవాంతభక్తి పుష్పరసామేయ భాసురముగ॥

ఉ॥ విద్యానగరి యాంధ్రవీరరాజన్యుల, భాషాభిమాన సంపదవునీవ,
సంస్కృతాంధ్ర ప్రతిష్ఠల నిల్ప దిగ్దంతులగు పండితుల యశోహర్మ్యమీవ,
అఖిలకవీంద్రకావ్యాంతరాత్మలకు భాండారమై వెలయు విన్నాణమీవ,
దేశదేశాగతాతిధి శిష్యకోటికి, జ్ఞానభిక్షను పెట్టు జనినినీవ,

అట్టి విజ్ఞానాసాగరమైన నీదుగర్భమందెన్నొ రత్నాలుగలవు వాని
దివ్యకాంతు లెల్లపుడు దేదీప్యమానమగుచు నజ్ఞానతిమిరము నణచుగాత॥

ఉ॥ పటుదీర్ఘ శాఖికావటవృక్షమెక్కించి, కోతికొమ్మచ్చు లూగించినావు,
పరుషకర్కశ శిలాబద్ధమ్ములైయొప్పు, నీవవరండాల జోకొట్టినావు
వచ్చునౌనీదు లేబచ్చిక పెరటిలో చెడుగుడాటలనాడజేసినావు
సింహాచలము, రామతీర్థము, కోర్కొండ టిక్కెట్లు లేక దాటించినావు,

తాదృశమహత్త రానందపాథమందు ముంచి తేలించినావు, నీముందునిలిచి
కండగలచిక్కని తెనుంగుకప్పురంపు హారతినొసంగితిని కొనుమమ్మ జనని॥





# మాతృభిక్ష

కవి సార్వభౌమ శ్రీపాదవారు, చెళ్ళపిళ్ళ వారు అధ్యక్షులుగా వారి ఆధ్వర్యంలో శ్రీపీఠికాపుర మహారాజకళాశాలలో దిగ్విజయముగా జరుపఁబడిన ప్రధమాంధ్ర వార మహోత్సవ సభలో శ్రీయుత దువ్వూరి సూర్యనారాయణమూర్తి గారిచే చదువబడిన పద్యములు.



# మాతృభిక్ష

కలముపోటులు సూరక్తి పోటులుగాఁగ
నాంధ్రకవులు కీర్తి నందునాఁడు
శాసనంబులు శిలాశాసనంబులు గాఁగఁ
గాకతీయులు దీప్తి గ్రాలునాఁడు
పోడు మన్ననుడి బాకుపోటెయై హతమార్పఁ
బ్రాతబొబ్బిలిదొర ప్రబలునాఁడు
వీరపాణమె శత్రువీరమారణముగా
రెడ్డిరాజులదీప్తి ఱేఁగునాఁడు
ఏనుఁగుల నెక్కితిమి పోతుటీఁగనైన
నాంధ్రరాష్ట్రపు సరిహద్దులంట కుండఁ
బారఁదోలితి మా యాంధ్రప్రతిభ తిరిగి
జననిఁ తెనుఁగమ్మ! భవతి భిక్షాం ప్రదేహి॥

ఆంధ్రసత్కవులెల్ల రస్తమించిరి గదా
తెలుఁగుఱేఁడులతోడ దివిని వెలిఁగి
ఆంధ్రశిల్పమహత్వ మంతరించెనుగదా
తెలుఁగుశిల్పుల శాణదీప్తి విరిగి
ఆంధ్రపౌరుషమెల్ల నరిగిపోయెనుగదా
తెలుఁగువీరుల కత్తి బెళుకువంటి
ఆంధ్రభాష లవెల్ల నణఁగిపోయెనుగదా
తెనుఁగుఊరప్పల దిబ్బ లంటి
కొంప దిబ్బయిపోయె మా గోడు మాసె

వృద్ధియాయిది నాశమాయెరుకపడదు
గతిని కల్పించి పూర్వాంనీప్రతిభనిపుడు
జనని! తెలుఁగమ్మ! భవతి భిక్షాం ప్రదేహి॥

సత్రముల్ చావళ్ళు చచ్చి స్వర్గము చేరె
దేవాలయములెల్ల దిగులుగొనియె.
దానదయా సత్యధర్మముల్ చెఱిగెను
నక్కజిత్తులె దేశ మక్కళించె,
దేశభాషలవెల్ల దిక్కుమాలిన వయ్యెఁ
బరభాషలే మాకు పథ్యమయ్యె
ఐక్యభావంబెల్ల నంతరించెను మాకుఁ
గప్పలబెకబెకల్ కడకు మిగిలె,
ఇనుపగజ్జెలతల్లి మా తెనుఁగునాట
తాండమొనర్చు కోటి పాదముల నాని
తెనుఁగుదీపిక దిగనాఱె తేజమణఁగి
జననిఁ తెనుఁగమ్మ! భవతి భిక్షాం ప్రదేహి

హరిహరాదులదిద్ది ఆంధ్రనిల్పితికదా
స్వామి విద్యారణ్యజాడయేది?
అష్టదిగ్గజముల నాదరించితిగదా
ఆంధ్రభోజా! పల్కవా మహాత్మ!
భారతామ్నాయసంపద నుద్ధరించిన
రాజరాజా! దయ రాదె నీకు?
తిక్కనాదికవీంద్ర దిగ్దంతుల నలర్చు

మనుమసిద్ధీ! మాటెమానికంబ!
ఓరుగల్ సామ్రాజ్యసార్వభౌమా! ఓ ప్ర
తాపరుద్రా మమ్ముఁదలఁప వేల?
పుణ్యకృష్ణానదీ పూతాంధ్ర రాజన్య!
శాలివాహన! మాదు గోల వినవ?
మెతుగుసీమలఁ దెల్గుబ్రతుకు నిల్పితివి స
ర్వజ్ఞసింగా! మూఁగవాఁడవయ్య?

కోటి విద్యార్థులిట దనుష్కోటివలెనె
భక్తినమ్రులై మీపాదపద్మములను
చేరి రానాటి ప్రతిభాభిసిద్ధి కొరకు
ఏమి సందేశ మిచ్చెద రివుడు చెపుడ॥





# పొట్టి శ్రీరాములు

ఇది ఆంధ్రరాష్ట్రావతరణకు ముందు జరిగిన గాథ. ఆంధ్రరాష్ట్ర సిద్ధికి అసువులు బాసిన శ్రీరాములు గురించి విద్యార్థి పౌర సంఘ మహాసభలో చదివినవి.



# పొట్టిశ్రీరాములు

(కాకినాడ మహాసభలో నాఁడు చదివినవి)

బలియైపోయితి వాంధ్రరాష్ట్రమునకున్ బాపూజి, రాజాజి కుం
డలలో గుట్టుముతోలునేర్పు ఫలమందం గాంచె, నీచావుతో
బలిపీఠమ్మును ముట్టి పై కుబికి యభ్రస్ఫూర్తి నుప్పొంగి యాం
ధ్రులతేజ మ్మది తమ్ముముంచుననుకోరో నెహ్రూ రాజాజియున్.

నీతలపే ఫలించి మరణించితిగాని మహానుభావ! యే
రీతి నవేళ ప్రాణము హరించుకపోయెనో? చూచువార లే
రీతిని నిల్వనేర్చిరొ? సుహృత్తమ! యెంత పెనంగులాడితో
నాతరమా వచింపఁగ ననామకు లైతిమి నీదుపోకడన్.

చావన నించుకంతయు విచారము లేక స్మితాభిభాషివై
యేవగ నీయసుప్రకర మిచ్చితివో భువనైకనంద్య! మా
యావుల నేఁటిమంత్రుల మహాదురితక్రియలెన్న ఘోరముల్
కావె? దయాగుణంబు గలుగన్ నిను జంపికొనంగఁ జూతురే?

ఒక్కకరో జుపాసమున కొక్కొకనెత్తురుచుక్క పిండి పెం
పెక్కిన యత్మశక్తిని వహించి సహించి దహించి దేహమున్
చక్కనిదెబ్బ కొట్టితివి చాలిది యాంధ్రులకెల్ల ఇంక నీ
ఫక్కిని ద్రొక్కుటో పరిభవమ్మున మూల్గుటో రాష్ట్రసిద్ధికై
యొక్కఁడే మహాహుతిగ నూడుటొ ఆంధ్రుల నిత్యకృత్యముల్.

క్రక్కదలించినావు పిడుగా సకలాంధ్రులజీవనాళముల్
పొక్కఁగఁజేసినావు తలఁపుల్ వలపుల్ తొలఁగించి; నేఁడు నీ
యక్కజ మైనచావునకు నందఱు నేడ్చిరిగాని రాజజీ
నొక్కడు ముఖ్యమంత్రి యతఁడొక్కడుప్రొక్కరుసుక్క రక్కటా.

అకట! నీవొక్కమృతజీవి వౌచు; మమ్ము
చెలఁగి జీవస్మృతులలోనఁ జేర్చినావు
కాక యేవాటనైన నిక్కముగ నిట్టు
లయ్యనే చూడ బలవంత మైన చావు?

ఏమహనీయవాంఛ ఫలియింపఁగ నీవొక మూగనోముతో
నే మరణప్రసక్తిఁ బయఎంచితివో దివి; కట్టిసిద్ధి యీ
పామరజాతి కిప్పటికిఁ బాల్పడలేదు, ధరిత్రి నిన్ను బోల్
భూమికి లెన్ని యాత్మబలిపూర్ణ నయ్యది సిద్ధిపొందునో.

ఏటికి కోటి కీడ్చెడిమనీషులు మంత్రులు, భూజనంబులా
కూడికిగుడ్డకున్ విలుచుకొన్నది వారల, రాష్ట్రసిద్ధియా
మాటకు గొఱ్ఱెతోఁక, ఇహమా పరమా యిది సామి? ఎందుకో
మూటలుగట్టుచుంటిమి ప్రభూ! ఒకమూడుదినాలముచ్చటన్.

నవ్వుచునుంటివో పరమనాటకవీక్షణసేయుచున్ దివిన్
రవ్వలు రాజ్యతంత్రములు ఊలకుఁ జక్కిలిగింత లెట్టు? లీ
గవ్వకు మూరనట్టిబొమికల్ పదవీకదనప్రసక్తితో
గవ్వకు గచ్చకాయకును గాక చిరాకు పరాకు లందఁగా.

పాలుం ద్రావెను రొట్టి మ్రింగెనని నిర్భాగ్యుల్ వచింపంగ నీ
వేలా నమ్మితి నెహ్రూజీ! నిజము సుంతేని న్విమర్శింపవే!
ఔలేపో! తుది నెగ్గనా యనుచు నాహా! నవ్వుకొన్నావా? మీ
లీలల్ రాముని స్వర్గసీమలకుఁ జేర్చెన్ మిమ్ముఁ బాతాళమున్

ఏనాఁ డెప్పుడు నెక్కడన్ గననిదై యేగాథలన్ బోధలన్
వీనుల్ సోఁకనిదై మహావిలయమై వీఁచెన్ తుఫా నౌచునున్
దీనన్ గొండలు దూదిపింజలయి యబ్బిన్ దేలె, రాష్ట్రానికై
ప్రాణా లొడ్డిన పొట్టిరాము మరణప్రారంభసంరంభతన్.

రతనము లన్నివో గులకరాలు దిగంబడుచుండె నింక, నే
జతనున మంత్రులందుఁ దమసంబు తొలంగునొ? రాష్ట్రసిద్ధియే
వితమున నబ్బునో? ఎవరివెంబడి నాంధ్రులు కార్యరంగమం
దతులితవృత్తి దూఁకుటొ కనంబడి దామతి మాకొసంగవే.

చేఁతలు మాని నాయకులు చేతుల నల్పుచు, ఆంధ్రరాష్ట్రసం
పాతముసేయ నెంచియె, యభాగ్యపుటెత్తుల నెత్తినారు, నీ
ఘాతముతో బయల్పడె, వికారము లన్నియు దాటిపోయె, నా
కూతలు కూలిపోయిన వకుంఠితఛాత్రకులైకశక్తి తా
నాతతవృత్తి రేఁగినది, ఆంధ్రుల రాష్ట్రము నీయ కేమికాఁ
జేతురు? దీని నడ్డగల చేవగలా రెవరింక? నెన్నుచో
ఈతెలుచాటుభాగవత మిప్పటిదా మహనీయ! తెల్పవే.

ఇచ్చిరటాంధ్రరాష్ట్రము హిహీ? మదరాసుతొలంగఁబెట్టియీ
బిచ్చపుమూఁట యెవ్వరి కభీపిత్సమో? తల నూడఁగొట్టి ని
ప్పచ్చర మైనరాష్ట్రపుశవంబు భరింప నొసంగి రంతెపో
అచ్చుగ మోయువారలు కళార్థులు నచ్చిన పుచ్చుకొండయా!

దేశచక్రమును దిద్దిరఁ ద్రిప్పగలయట్టి
నాయకప్రముఖు లున్నారు మాకు
ఆవులించిన ప్రేవు లల్ల లెక్కించెడి
భూరిమేధావు లున్నారు మాకు
వెనుదీక రక్తనైవేద్యము నిడఁగల
ధీరులు శూరులున్నారు మాకు
రాష్ట్రానికై త్యాగరక్తి జీవితమిడ్డ
నవ్యాంధ్రభీష్ము లున్నారు మాకు

అపరచాణక్యయౌగంధరాయణాది
దివ్యరత్నాలు గలవు మా తెనుఁగుగనుల
ఏమిలాభ మనేకత యినుమడించి
ఆంధ్రుల ప్రశస్తి నేఁడడుగంటుచుండె.

కలముపోటులు చూఱకత్తిపోటులుగాఁగ
నాంధ్రకవులు కీర్తి నందునాఁడు
శాసనంబులు శిలాశాసనంబులు గాఁగ
కాకతీయులదీప్తి గ్రాలునాఁడు
పొడు మన్ననుడి బాకుపోటెయై హతమార్చ
ప్రాంతబొబ్బిలిదొరల్ ప్రబలునాఁడు
వీరపాణమె శత్రువీరమారణముగా
రెడ్డితేఁడుల దీప్తి రేఁగునాఁడు

ఏనుగుల నెక్కితిమి పోఁతుటీఁగనైన
నాంధ్రరాష్ట్రపు సరిహద్దు లంటకుండ
పారదోలితి మాయాంధ్రప్రతిభ తిరిగి
అంబ! జగదంబ! భవతి భిక్షాం ప్రదేహి!

భక్తినమ్రుండైన పట్టాభిరాముండు
కోదండరాముఁడై కూడెనేని
మౌనముద్రా ధారియైన సాంబుఁడు నిరం
బుండౌచు శూలియై పొదలెనేని
ఆంధ్రకేసరి దుర్గమారణ్యములు దాటి
అలనృ కేసరియౌచు నలరెనేని
ముడుపులందుటయందు గడిదేరు వెంకన్న
బాబు నిస్స్వార్థుఁడై పఱగెనేని
కుడ్యబిడాలమౌ గోపాల చక్రవ
ర్తియు నార్జవమున వర్తించెనేని

అమలమై సువిస్తీర్ణమై అద్వితీయ
మై సుఖప్రదమై ధన్య మైనయట్టి
ఆంధ్రరాష్ట్రము మనకప్పు డబ్బుననుచు
ఢంకపై దెబ్బకొట్టి చాటంగ వలదె?

జూ గింకేందుల కాంధ్రరాష్ట్రపు మహాసౌధమ్ము నిర్మింప నీ
త్యాగ మ్మయ్యె పునాదిరాయి, మహితాత్మా! నీదుదుర్భేద దీ
క్షాగాన మ్మది దిగ్దిగంతములదాకన్ నిండి మార్మోగు నీ
ప్రాగల్భ్యంబు పగిల్చివేసినది దుర్మంత్రిత్వదుర్భిత్తికన్.

సకలతీర్థాల హస్తి మజ్జినము సలిపి
నేఁడు నీయాత్మ సుఖసుప్తినిన్ మునుంగు
అంతతో నీకు మాకు ఋణానుబంధ
మంతరించు గాఁబోలు రామయ్యతండ్రి!





# శ్రీ జయంతి రామయ్య గారు

కవి, శాసన పరిశోధకుడు, ఆంధ్ర వాఙ్మయానికి వీరు చేసిన సేవ సర్వతోముఖమైనది. వీరు పిఠాపురం, బొబ్బిలి, వెంకటగిరి సంస్థానాధీశుల ప్రోత్సాహముతో ఆంధ్రసాహిత్యపరిషత్తును ఏర్పాటు చేశారు. ఇది మొదట చెన్నపురి (మద్రాసు) ఉండేది. తరువాత కాకినాడకు మార్చబడినది. ఈయన ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రికను ప్రారంభించి అనేక అముద్రిత గ్రంధాలను ముద్రించినారు. సూర్యరాయంధ్ర నిఘంటువు నిర్మాణమును 1936లో ప్రారంభించినారు.



# శ్రీ జయంతి రామయ్య గారు

సీ. రేకెత్తె నొకనాఁడు ప్రాకటమ్మగు 'కవి
త్రయ'వాణి కెగ్గు లెంచెడిమనీష
కాలూనెనొకపరి గ్రాంథికాంధ్రీమచ
ర్చిక కంగభంగంబు చేయుబుద్ధి
చెలరేఁగె నొకతఱి చిన్నారి తెలుఁగుకై
తకు దిగంబరత యంద మనునూహ
పొడసూపె నొకసారి పొల్లకబ్బములు బి
డ్డల కుగ్గుపాలుగా కలుపుకోర్కి

సంభవవామి ధర్మసంస్థాపనార్థాయ
యన్నరీతి నట్టి యవసరముల
నిలిచి కశ్మలములఁదొలఁచి జయంతి రా
మయ్య తెలుఁగువారియశము నిలిపె.

సీ. ధనవంతులను జమీందారుల ఱేఁడుల
ఠీవితో నొక్కత్రాటికిని దెచ్చి
కవిపండితవిమర్శక శిరోమణులనెల్ల
మేటిబోధల నొక్కమాట నిలిపి
అధికారివర్గమ్ము నటచేత బిగియించి
ధనపిశాచిని కాలఁ దన్ని నిలిచి
ప్రభుకోటిసాయమ్ము పరిభవమ్ముగ నెంచి
యసహనపరుల కాలాననీక

ఆంధ్ర సాహిత్య పరిషత్తు నలవరించి
సూర్యరాయాంధ్రకోశ ముత్సుకతఁ గూర్చి
పరిషదాశయసిద్ధికై ప్రాకులాడి
ధన్యతనుగాంచితోయి విద్యద్వతంస!

**ఉ.** కజ్జలగ్రామ్యవాదపరిఖండన ఖండనఖాద్యయుక్తి సం
ప, జ్జయభూషితోగ్రదురవాపకఠోర కుఠారమూర్తి! నీ
పజ్జల గ్రాంధికాంధ్రి బహుభంగుల పెంపుల నింపు నింపె నీ
వొజ్జలబంతి వైతివిగదోయి త్రిలింగజనాళి కెప్పుడున్.

**ఉ.** ఆడినమాటమాటయు శిలాక్షర, మేమొకయుక్తి పల్కు, వె
న్నాడని రామబాణము, మహోమహ! పెట్టనికోట నీకు నూ
టాడని కార్యదీక్ష, పరమార్థమె నీదగుపట్టుకొమ్మ, నీ
వాడినదాఁట పాడినదియయ్యెను బాటగ పండితాగ్రణీ!

**గీ.** చేసి చేయించి చెప్పించి చెప్పినంత
మొనసి చేసిన యాదర్శమూర్తి వీవ
కొండ లుడ్డాడి నీమీద కూలుచున్న
నడుగు కదుపని మేరుధీరుఁడవు నీవ.

**ఉ.** ఒప్పులుగాంచి తప్పులనునూహను కోశముఁగూర్చి యజ్ఞతం
కుప్పలు తిప్పలెన్నిన ప్రకోపపు వ్రాఁతలు నింద లన్నిటిం
తప్పకచూచి యిందొక పద మ్మొకయక్కరమేం గ్రహింపఁగా
చొప్పడ దేమివ్రాఁత లనిచూత్కృతిచేసి హసించి తయ్యరే?

**చ.** అనితరశక్తి మీది విబుధాగ్రణి! చెప్పక చెప్పె యుద్ధ మ
ల్లుని బెజవాడ శాసననిరూఢపరీక్షఁ విమర్శకుల్ ప్రభుల్
కొనగొని మీదు ధీపటిమకుం మది మెచ్చుచు వేలవిత్తమున్
వినయముతోడఁ గాన్కలిడువేడుక లాంధ్రులు విస్మరింతు రే?

**గీ.** దేవభాషాకృతులు తేటతెన్గులోని
కనువదించి స్వతంత్రకావ్యములఁ గూర్చి
కవిగను విమర్శకుఁడుగను ఘనతకెక్కి
యున్నతోద్యోగివై వన్నె గన్న దొరవు.

**ఉ.** సాలున కొక్కమాటె స్వరసంగతి హాయిగ గొంతులెత్తి వే
దా లనుచుండి శ్రావణికిఁ దార్కొనుబాపల విత్తనాలకుం
జాలెడివారు వీరలని సాదరవృత్తి బహూకరించి నీ
పాలితధర్మరీతి యొరవళ్ళుసుమీ మనతెల్గు వారికిన్.

**సీ.** ఒకయోరచూపులో సకలమ్ము పసివట్టి
యున్నదున్నటు పల్కునూహ నీది
ఒకచిన్నదగ్గులో సకలమ్ము పెకిలించి
యరిశక్తి హరియించుగరిమనీఁది
ఒక వాదయుక్తితోఁ బ్రకటసంస్థానముల్
నిలఁబెట్టఁగల బుద్ధిబలమునీది
ఒక బొమవిరుపుతో నొగినెంతవానినేఁ
ద్రోసి రాజనఁజాలు త్రోవనీది

అతడు కొండంతపండితుం డగునుగాక
కవియగు విమర్శకుండగుఁగాక నిన్ను
కాదనఁగ నొక్కఁడును సమకాలికులను
గానరాకుంట నీమహోఘనత గాదె.

**చ.** నిలిపితి వెన్నొ దీపముల నీదుహయామున ప్రాతపొత్తముల్
దులిపితి పీఠికారచనతో వెలయించియు వానిఁగొన్ని నీ
కలము వెలార్చి మించినయఖండశతాధికసద్విమర్శనల్
కొలదులె? భాస్యపంక్తు లనుకోవల దే తదధీనసారముల్.

**గీ.** తెలుఁగువాణికి మణిమయోజ్వలకిరీట
మై విరాజిలు సూర్యరాయాంధ్ర కోశ
మకట పూర్తికాలేదనునట్టి బెంగ
వలదు రామార్య! తీర్తు మాతలఁపు వడినె.



# పిఠాపురపు కోట

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణానికి ప్రోత్సహించిన సారస్వత కవిపోషకులు, అనేక విద్యాసంస్థలు నెలకొల్పిన  పిఠాపురం మహారాజా "శ్రీ సూర్యరాయ బహద్దరు వారి తదనంతరం – పిఠాపురం కోట దుస్థితిని వేదనతో దృశ్యమానం చేసిన ఖండికయే "పిఠాపురంకోట"



# పిఠాపురపుకోట

**(ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక – ముద్రితం)**

చికిలికత్తుల లోపలికిపోఁతుటీఁగను
చొఁఅనీని పహరాలు చూడరావు
గులకరాల్ ముండ్లతుప్పల దోఁగి లోకోట
బాటలివ్వియటంచుఁబట్టుపడవు
శిలనెత్తినటు నిట్టనిలువులై కదిసి మూఁ
తలువడ్డతలుపులు తొలఁగఁబోవు
మంత్రిదివాను సామంతులరాకపో
కల పటాటోపముల్ కనులఁబడవు.

లోన నడుగిడ గల్లుగల్లురని లక్ష్మి
తాండవం బాడు బ్యాంకు లేదరిని లేవు
అశ్వములు గజమ్ములును పారాడు చోట్ల
గర్దభము లూరఁబందులు గంతు లిడెడు.

కోటముంగిటి శతఘ్నుల యందచందముల్
దులదులనై త్రుప్పుధూళిఁ గలసె
బూజులఁబ్రుంగి మబ్బులచందమామ యై
భవనాలశోభ నిప్పచ్చరంబు
వందిమాగధు లయి వరస ముప్పూట న
గారాలమ్రోఁత ఆకాశసుమము
బంభరమ్ములతో గుభాళించు పూలతో
టల హెురంగులును మచ్చులకులేవు

పాములకు ముంగిసల కాటపట్టు లగుచు
కోఁటగోడలు బురుజులుఁ గుతిలవడియె
మాయురే! మానికమ్మును మసి యొనర్చి
కాలమా! యెట్టియాటాడఁగలవు నీవు?

స్తంభంబె మిగిలి గ్రద్దలు వ్రాలి చెదవట్టి
కోటముందుపతాక కొమరు తఱిగె
పొగచూఱినటులు చొప్పులు దప్పి దీపధూ
పములు వేరయ్యె లోపలిహజార్లు
లోకోటగుమ్మమ్ములో వేఁదలలరావి
వేసారియో పుల్లవిఱిగిపోయె
కనుచూపు మేర నెక్కడ చూడు, కోటలో
కిక్కసకసవు క్రిక్కిఱిసి పొదలె.

పాకుడులుగట్టె నూతులు బావు లెల్ల
గజము లశ్వమ్ము లేకడఁ గానరావు
బంటురౌతుల యాబరాబరులు లేవు
పొగలుచుంటివటే పిఠాపురపుకోట?

భవ్యాంధ్ర సాహిత్య పరిషదధ్యక్షుల
భవనమా నీ కెట్టి పాటు గలిగె?
ఘనసూర్యరాయనిఘంటు పోషకుల ది
వాణమా నీ కెట్టి పాటుగలిగె?
అయుత పండితకవీంద్రాధారభోజుని
యంతఃపురమ యెట్టియదటు గలిగె
సరసకళాలయస్థాపనపరు మహా
గారమా నీ కెట్టిగతి పొసంగె.

ఆంధ్రభోజుని సంఘసేవాభినిరతు
ధార్మికప్రభు లోకబాంధవుని నెలవ!
ఈ ప్రజాప్రభువులచిక్కి తృతీయేక్షణముల
యెఱగ నైతివటె పిఠాపురపుకోట!



# శ్రీమంతుడా!

(హిందూసుందరి - ముద్రితం)

భోగభాగ్యములు శాశ్వతము గాదు. వీటిని అన్నార్తులకు కొంచము అయినా దానధర్మము చేసి సద్వినియోగము చేయుట మంచిదనే భావ వ్యక్తీకరణే ఈ పద్యరూపము.



# శ్రీమంతుడా!

కడుపులోనాకలి దహించి యుడుకుచుండ
నెండలకు వానలకును జీర్ణించిపోయి
మానమును గప్పుకొనుటకు జానెడైన
చినుగుమసిగుడ్డపాత గోచీకిలేక
శీతలమువాతఁజిక్కి శుష్కించిపోయి
కష్టములలో దురంత రోగములుబట్టి
పీల్చి పిప్పినియ నోపికయుఁజచ్చి
బక్క బడుగయి యెముకలు బయలుపడఁగ
చిరిగిపోయిన జోలెను పరిచిముందు
రోడ్డుప్రక్కనుజేరి మొఱ్ఱోయి తండ్రి!
ఒక్క డబ్బోయి! కడుపు మంటోయి బాబు!
కూడులేదోయి! నా బాధఁ జూడరోయి!
నడువకాళ్ళును జూడ కన్నైనలేదు.
నాయనా! బాబులారా! యనాథనయ్య
యనుచు గొంతుక చించుక యరచి, యేడ్చి,
అలసి, పడిపోయి, నోట మాటాడరాక
దప్పిఁగొనుచును చావ సిద్ధముగనున్న
ఆ దరిద్ర నారాయణు నరయవేమి?
నీ చిదానందమే నీద? నీదు షోకు
నీదు గొడవయు నీదారి నీదటయ్య?
కాని యిచ్చిన నీకున్న మానెగాని
చోద్యమునకైన కన్నెత్తి చూడవేమి?
వెనక జన్మానచేసె నీ వెధవ, యిప్పు
డనుభవింపక తీరునా? యనుచువాని
మెట్టవేదాంతివై యిట్లు తిట్టతగున?
అయ్యయో నీదు భాగ్య భోగ్యంబులెల్ల
కన్నుమూసిన చిమ్మ చీఁకటులుగావె?
“ఆత్మవత్సర్వభూతాని” యనుటవినవె?



# నక్క ఏనాదిబాబు

హృదయం ద్రవించేలా యానాదిబాబు చేతిలో మరణించే నక్క యొక్క మరణ ప్రార్థన వివరించబడింది.

"ఆత్మవత్ సర్వభూతాని"అనే నీతిని బోధించే ఖండిక.



# నక్క ఏనాదిబాబు

నాడు గ్రహచారమిట్లు గనంచునెఱుఁగ
కిట్లువచ్చితి మీ పల్లెకేసి రేయి
పడితి మీకండ్ల నింకేటిబ్రదుకునాకు
నాయమా నన్నుజంపనేనాదిబాబు.

ఈటితో ముందుబొడిచిన పోటువలన
లుబ్బలుబ్బలై నెత్తురులోనదేలి
సొమ్మసిలఁజేయ ప్రేవులచుట్టలివిగో
బాధసహియింపనే నాదిబాబు నన్ను
బాదెదవు దుడ్డుతో దయరాదతండ్రి

చంపనుంకించితే నొక్కసారి బుఱ్ఱ
పగులఁగొట్టు మీబాధను పడగలేను
ఇంతలోవీడదలకొంటి వేని దయను
నాదుకడసారి చూపు కూనలను జూచి
అసువుల పరిత్యజింతు నేనాదిబాబు.

నెత్తురుపెల్లుగన్ వరద నీరయిపారుచు నుండెనిప్పుడె
ల్గెత్తి కుయోమెరో యనుచు నేడ్చుటకైనను శక్తిలేదు నీ
సత్తువఁజూపి యింకననుచావఁగమోదెదు దుడ్డుకఱ్ఱతో
బొత్తిగనెంతనిర్దయుడవోయి కసాయివలెన్ దురాత్ముడా.

నోరులేనిదాననుగాన మీరు నాదు
హతమునార్చిరి యిదె నరహత్యయైన
నావలెనెయేడ్చి యేడ్చి యేనాదులంత
ఎట్టిశిక్షకుగురి యయి నీల్గుచుంద్రో

బుద్ధభాను నహింసా ప్రబోధనాద
బిందుకళలింకిపోలేదు బెదటిమీకు
వట్టి జ్ఞానశూన్యులు పశుప్రాయులౌట
మీ చెవులసోకనేరవామేటి శృతులు

ఇంతదయలేక చంపుట కేనునీకు
నేమి ఘోరా కృతిపని గావించియుంటి
పోని చంపి తినెడిదాననైన గాను
నన్నుచంపెదవేల ఏనాదిబాబు

రోతకొట్టుమీపాటకజాతిలోన
ఈ దురంతహింసాకృత్య మెచ్చుచుంట
కూడుగుడ్డలు లేకుండ కుములు గతియె
గాని యభివృద్ధియనుమాటె గలుగబోదు.

ఇంతకును మిమ్మన పనేమి! సృష్టిలోన
గొప్పలోటియ్యదే ప్రాణి! కోటిలోన
గటికిపటకకునోరున్న ! కరవుదీర
ఏడ్చిపోనేమొ పశుబాధ! కెంతొ వెటచి

కాననోయేనాదిబాబూ
నాదు మనవిని వినుచు సర్వ
ప్రాణులను నీ ప్రాణమటు గా
పాడదగునయ్యా!





# కంకరకూలి

దీనియందు శ్రమజీవుల అవస్థవర్ణితం. కూలివాని అమాయకత, బీదజీవనం జాలి కలిగిస్తాయి. శ్రమజీవులలో మితిమీరిన మద్యపానం పనికిరాదని ఉద్బోధ.



# కంకరకూలి

మండుటెండలు జాజ్వల్యమానము లయి
యదరు లుమిసెడి మిట్టమధ్యాహ్న వేళ
లందు నవెన్నెలలో నిల్చినట్లు నిలిచి
పణఁకులఁ బగుల్చుకూలి; యెవ్వఁడవు నీవు?

కండరాల్తేరు నీయంగకములనుండి
కాల్వలౌచు ముచ్చెమ్మటల్ గారుచుండె
మిటమిట రగుల్చు బీరెండ మెయికిఁదాఁకి
బొగ్గువోలె నీ దేహము పొలుపు తఱిఁగె.

గొడుగునీడను నీదుబుడుతడు చిన్నారి
పొన్నారినుడల దోఁబూచులాడ
లేచియాడెడి కోడెత్రాచు పడగవోలె
శిర మెత్తి పసిబిడ్డ చిందులాడ
ఉక్కుసుత్తెను ఊలు టక్కు టక్కున మోఁదు
ఆలు నీసరస నూసాడుచుండ
తట్టలో కూటిముంతల సువాసనకు నీ
గలు మూఁగి నెఱవెట్టి గొలుకుచుండ

గప్పుగప్పునఁ బొగ చిమ్మికొనుచుఎ నోట
నడ్డుపొగచుట్ట యాసమా టాడఁజేయ
సకల దేహము ధూళిధూసరిత మయ్యె
బండలను పిండిసేతు వెవ్వండ నీవు?

పాప మాబిడ్డ చింకిరిపాఁతలోన
పొరలి తెగపోరువెట్టు నిద్దురకువచ్చి
నోరు తడియారిపోయెనేమో రవంత
చనుగుడుప పంపు మింటిదానిని పనాపి.

ఆతపోగ్రతకు దేహము కందు ననుచు నం
గాత్రాణముగఁ గంచుకము ధరించి
వడగాడ్పు చూపుసెబ్బర దెచ్చు నీయెండ
ననుచు నేత్రత్రాణ మమరిచికొని
అడుగు మోఁపిన కాలితొడు గూడుననుచుఁ బా
దత్రాణ మొందు మెత్తనిది తొడిగి
తలకు వేఁడెక్కి వేదనపుట్టు నని శిర
స్త్రాణ మిమ్మైనవేష్టనము దాల్చి

అంతతోఁ దృప్తి పడక సర్వాంగరక్ష
కాతప్రతము పూని పో నడల మేము
ఉడుకుటెండలు పుటపాక మిడెడివేళ
గోచిపాతరాయుండవై కుములుచుందు.

ఇన్ని రక్షణోపాయములన్న మాకు
రోజురో జేవా రోగాలొ రొచ్చులొగద
ప్రకృతికి శరీర మర్పించి పరగునీదు
దేహ మున్నది యది వజ్రదేహ మటులు.

పగలు పగలంత చెమటూడ్చి పడెడినీశ్ర
మమ్ముపైఁ బడి యినుపపాదమ్ము లాని
సంచరించు నుద్యోగిపిశాచములకు
నొక 'సలాం, చేయలే వమాయకుఁడ వీవు.

కాయదేఱునీకర్కశకరమునందు
ఎన్నికొండలు పిండి కానున్నవొక్కొ?
తఱుగునా యవి? నీకష్టదశలు గనక
దినదినము పాపమట్లు వర్ధిల్లుచుండ.

నవరుచులఁ దినునట్టి యీనాటిమేము
ఇట్టు లుంటిమి రోగాలపుట్టల మయి
గంజి యంబలి త్రావి యాకలి నణంచు
కొన్న నీ వుంటి పిడుగుముత్తన్నపగిది.

విసపుటాకలిచిచ్చుతో వేఁగి మందు
నీకు జేనెడుపొటయే లేకయున్న
ఏకుటీరమునందొ హాయిగ వసించి
కుకుకుదుగదోయి చీఁకుచింతలకుఁదొలఁగి

ఆలును బిడ్డపాప లిటులల్లలనాడఁగఁ బొట్టకూటి కే
జోలియు సొంటు లేకయె నిజోదరపోషణ సల్పుచున్నయో
కూలి! మఱొక్కవృత్తి సమకూర్పక దుర్విధి నిర్దయాత్ముడై
రాలు పగుల్చువృత్తి నిడెరా యని డెందమునందుఁ గుందెదన్.

కాని యొకమాట రెక్కలకష్ట మిట్టు
తెచ్చికొన్నది హాయిగఁ దివి సుఖించు
మంతెగాని దొప్పెడికల్లు కాసపడితి
వేని నీయిల్లు గుల్లసుమీ గ్రహించు.



# అజవిలాపము

వధ్యశాలలో చంపబడే ఒక మేక ఒక కసాయితో తన అంత్య సందేశం కన్నీరు గాధగా చెప్పినట్టుంది. దాని ప్రాధేయతలో కరుణ ఉట్టిపడుతుంది. ఈ ఖండిక "జీవో జీవస్య జీవినమ్" అనే సత్యాన్ని ధ్వనింపచేస్తుంది.



# అజవిలాపము

ఓకసాయి! వధింపకు ముదుగు మొక్క
డంత్యసందేశ మున్నదోయయ్య వినుము
"ఆత్మవ త్సర్వభూతాని, యనెడి తత్త్వ
మెన్నడైనను వినియుంటివే మహాత్మ!

కూరిమి మీవెన్ బ్రదుకకూడదె మేమును? జీవితాశ సం
సారసుఖమ్ము మీకెటులొ సర్వము మా కటుగాదె? బిడ్డలున్
లేరె? దురంతవృత్తికిఁ జలింపదె నీకరవాల మక్కటా;
నోరులులేనిజంతువు లనుంగులటంచు దలంపవేలొకో?

మేకలమై పశుత్వమును మేము జనించినయంతమాత్ర నీ
వీకరణి న్వధింపనగునే? యిదియే నరహత్య యైనచో
నీకుటి గాకయుండునె? వినిందితవృత్తిని మాదుసంతతిన్
శోకదవాగ్నిఁ గూల్చెదు పశుత్వము నీదియెగాక మాదియే?

కుత్తుక కత్తితోఁ దఱిగి కుండలనొడ్డి స్రవత్కవోష్ణపు
న్నెత్తురు నింపి యంగముల నిష్కరుణమ్ముగ వ్రచ్చి మేనితో
లిత్తులనొల్చి రాక్షసవిధిన్ హతమార్చెదు; జాలియన్నదే
బొత్తిగ లేదు నీయెడఁదఁ బోలునె నీకిది వంశఘాతుకా?

విలవిలఁ దన్నికొంచుఁ బృథివింబడి జీవముపోక కస్తితో
గిలగిలలాడుచుండ యమకింకర! నిర్దయ నాదుశీర్షము
జెలుకుదు వెన్నిజన్మములఁ జేసినపాపమొ? నీవు నేను, ని
ట్టులుజనిభాగ్యమందఁగఁగుటుంబము లెన్ని యొకూలియేడ్వగన్.

సాపడఁ గందమూలములు సారపుఁగూరలుఁ గాయ లుండఁగా
కూపపుఁ బొట్ట నింపికొనఁ గూడనిమాంసములేల ? వానికై
మాపని పట్టనేల? కసుమాలపువృత్తికి రోయవేల? యే
పాప మెఱుంగ మాయుసురు వాయునె నిన్ను దహింపకుండగన్.

మావధకై ప్రభుత్వ మిటు మారణశాలలు నిల్పినట్లు మీ
మీవధ దీర్పఁ దారు పుడమిన్ భవనా లెచటైన నిల్పరే?
చావు ఘటించుక్రూరులఁ గసాయుల నిల్పిరె జీత మిచ్చి? లే
వేవియు మానొసళ్ళనె లిఖించి విధించిరిగాక దుర్దశల్.

జాతరలందు శక్లు కొసంగెడియాబలి కేము, జన్నముల్
సేతకు మేమె యాహుతి, మలీమస మైననిష్టకృజాతికిన్
భూతికి మేము, క్రూరమృగభక్తికి మే మిటు జాతియెల్ల ని
ర్హేతుకమౌ సకాలమృతికే గుఱియయ్యెడి నేమికర్మమో?

పెంచినయన్నినాళ్ళు మముఁ బెంచుచుఁ బెట్టుచు పెద్దమంద గా
వించుచు మాదుపాడిని సమృద్ధిగఁ ద్రాగెడునట్టి గొల్లఁడే
వంచకుఁ డౌచు మ మ్మిటులు వధ్యగృహంబున కొప్పగింపఁడే?
కంచియె చేను మేయ, నిను గాఁడఁగ నాడుట వెఱ్ఱియేగదా!

జేనెడిపొట్ట నింపికొనజెల్లక నెత్తురుకూటి కిట్లు మా
ప్రాణము లూడ్చుచుండితివ భాగ్యుడ పాతకజాతిమెల్ల నీ
యాననమందె నిల్చె నెటులైనను నీకిఁక శుద్ధి లేదు నీ
మానములూనమయ్యెఁ బశుమారణశాలకు గృధ్రశాంతులా?

కన్నులఁగాంచి నాగతిని గాఢతరం బగుభీతిగర్భని
ర్భిన్నములై వణంకి దురసిల్లుచు నిల్చెను మేకలెల్ల నేఁ
డిన్నెగు లొక్కరొక్కరికె యేర్పడుఁ దప్పదటంచు నీడ, నా
పన్నులఁ బ్రోచి యీమరణబాధ మరల్పఁగఁ జాల రెవ్వరున్.

చత్తునటంచు నం దెలియఁజాలక నాపసికూనలెల్ల నె
ల్గెత్తుచుఁ జంగువన్ బరువులెత్తుచుఁ జ స్గుడవంగ వచ్చెడున్
ఒత్తిడి చేయఁబోకు మయమో దగదొట్టినచిచ్చుటాకలిన్
బుత్తు ననుంగుబిడ్డలకుఁ బుచ్చుము నన్నొకతూరి చెచ్చెరన్.

రావులుఁగుల్ త్వరంబడుచు రావులు వెట్టెడు, గృధ్రజాలమున్
కోపున నార్చి త్రుళ్ళుచును గోపము నూపెడుఁగత్తులెల్ల మా
రూపులు మాఁప సిద్ధము లరుంతుదవృత్తిని, జాల మేల? ఈ
తాపము వాపి చంపి యిఁక ధన్యత గాంచు కృపాదరిద్రుఁడా!

బుద్ధభానునహింసాప్రబోధనాద
బిందుకళ లింకిపోలేదు బెదరి మీకు
జ్ఞానశూన్యులు మాకన్నహీను లగుట
మీచెవుల సోఁకనేర వామేటిశ్రుతులు.

ఇంతకును నిన్ననఁ బనేమి? సృష్టిలోని
గొప్పలో టియ్యదే ప్రాణికోటియందు
గఱికపరకకు నోరున్నఁ గఱవుదీఱ
నేడ్చిపోనేమొ మాబాధ కెంతొ వెఱచి.

# కలియుగ మొఱ

కలియుగ సత్యదేవులు నఖండిత మూర్తులు సాధు రక్షకుల్
కలిమలతారకుల్ పరమకారుణికోత్తములంచు సద్యశః
కలితులు నీవుఁదిర్మలను గాఁపురముండిన వెంకటేశుఁడున్
దలఁపక లోకకష్టముల దాఁగుట చెల్లునె లోకనాయకుల్.

కాలము మాఱిపోయెఁ గలికాలము ముంచుక వచ్చె నీ పరీ
పాలక వర్గమన్న భయభక్తులు లోకులలో నశించె మం
త్రాలకుం జితకాయలును రాలవు ధర్మము శక్తిహీనమై
చాల కృశించె నిట్టి యగచాట్లను మాన్పుడు నాయకోత్తముల్.

కోట్ల విత్తము ప్రజనుండి గుంజిగుంజి
కులుకు తొలఁకఁ గిరీటముల్ కూర్చుకొనుచు
కొండపై గుళ్ళలోపలఁ గుదురులుకొని
మీ శిలాతత్త్వముంజూప మేలటయ్య?

హాయిని స్వార్థమున్ విడిచి యందఱు నన్నివిధాల దొర్లి మా
నాయకులెల్లఁ బాటుపడినారు గదా ఫలమేమి? ముంచు కే
పోయెను పోవుచుండె నిఁకఁ బోఁగల; దీ బ్రతుకింక దుర్భర
మ్మాయి మహాత్ములార! వినుఁడో కనుఁడో జగ ముద్ధరింపుఁడో

సేవ్య సేవక భావమ్ము చేతఁబట్టి
క్రేతృ విక్రేతృ తత్వ మార్జించి కొంత
మలసి కప్పల తక్కెడ మతములూని
మేమె మాకనుల్ పొడుచుకొన్నాము దేవ!

రతనములన్ని వో గులకఱాలు దిగఁబడుచుండె నిక నే
జతనముచేత నంధతమసంబు తొలంగునొ నాయకాళి, మా
బ్రతుకుఁ దెఱంగులెవ్వియొ దురంతము దీనిని నెవ్వఁడాపునో
అతుకులబొంత మాదు బ్రతుకయ్యెను మీదు తటస్థ వర్తనన్

దుంప పిండియుఁ జేరుడుల్ దుంపనూనె
తుక్కు దూఁగఱ తినుచుండి తుదకు మేము
పశులమైతిమి; పోవునే పశుత మాకు
పశుపతులు తాము, మము దిద్దవశమె మీకు?

పుట్టు సంతతి పూచిక పుడుకలయ్యె
కన్నె లవివాహితలు మాచకమ్మ లైరి
కళావు మాత్రము వర్తక గణముఁగూడి
దినదినము పాపమట్లు వర్ధిల్లుచుండె.

“ఎం.ఎ., బి.ఎ.,లు ప్యాసుకానీ” మనోహ
రాకృతుల దాల్చనీ, హృదయంగమముగఁ
బాడనీ, కళలెల్ల నేర్వంగనిమ్ము
ఆడు దొక “అర్ధనా’ విలువందదయ్యె.

మూతిని మీసమున్న మల మొల్కయితే సరి విద్య రూపమున్
జాతియు, నీతి లేమికి విచారము లేదొక రెండువేలకున్
‘ఖాతర’ లేదు కట్నము; జగామగవాడయి కొద్దిగల్గ నా
ప్రేత పిపాసలింక పదివేల తిలాంజలులైన లెక్కయే.

కునికెడి నక్కపై వడిగ కూలెను దాళఫలం బటన్న రీ
తిని దినఁదిండిలే కడలు దేశమునందె ‘తుఫాను’ లెత్తనా?
కన వినరాని ముంపుడులు కయ్యము లల్లరులా? సమస్త నా
శన మొనరింపు పూనికల? చావనుజంపక చావనీయకన్.

ఏమేమో యిటులాడినంత ఫలమేమీ సత్యనారాయణ
స్వామీ! దైవము నిప్డు మానుషము మించం జూచుచుండెంజుడీ
మీమీ హక్కుల గుళ్ళగోపురములన్ మీ స్వమ్ముల న్వీడి తా
మేమార్గమ్ములు పట్టగావలెనొ? ‘మెమ్మే’యంచు నిట్లుండినన్.



# సంక్రాంతి శోభ

సంక్రాంతి సమయంలో పంటలు ఇంటికి వస్తాయి. రైతులు చేసే దాన ధర్మాలకై పలువురు వస్తారు. ఇళ్ళను అలంకరిస్తారు. గ్రామమంతా పండుగ వాతావరణం ఉంటుంది.



# సంక్రాంతి శోభ

చిత్రాల ముత్యాల చిన్నారి ముగ్గుల
ప్రాంగణంబులలోని భవ్యశోభ
పండుగ ముస్తాబు పరిఢవించిన గృహ
పంక్తుల దొనకాడు భవ్యశోభ

బంగారు పైరుకుప్పలు నూర్చ కాపులు
వెన్నెలరేల గుప్పించుశోభ
పండిన జొన్నచేల వ్రాలెడి చిల్కగుం
పుల ద్రోలు కాపుటింతుల శోభ

పెద పండువు నాళ్ళలో పేరటమున
పెండ్లినడకల కదలు గుబ్బెతల శోభ
ఇన్ని శోభలుతోడ సంపన్నమగుచు
సొగసులొలికించు సంక్రాంతిశుభ శోభ

గంగిరెద్దుదాసు బాకాపట్టి వెంకన్న
దూడూ యనుచు మెడడోలుకొట్ట
మల్లిఖార్జున దేవున్నిల్లుద్రిప్పి ఢం
కా బజాయించి శాంకరుడు పలుక

కత్తులు కట్టి మంగలి మీస మొడిత్రిప్పి
కలహింపఁగోడి పుంజులను విడువ
అశ్శరభ శరభయంచు శైవులు ప్రభో
త్సవమున వీరాంగ సరణిద్రొక్కె

ఇచ్చినమ్మకు పుణ్యమీయునమ్మకుఁబాప
మని భోగిమంట కర్భకులు నార్వ
క్రొత్తయల్లుండ్ర షోకుల కత్తమామలు
మురిసి కూతులనక్కుఁబెరిమఁజేర్ప

పండు వెన్నెల సంక్రాంతి పండువపుడు
కొసరి కొంగ్రొత్త శోభలగ్రుమ్మరింప
ముజ్జగంబులు సంతోషమున మునుంగ
చొక్క చేసెను సంక్రాంతి శోభ జనులు



# అగ్గి కత్తెర

వేసవి కాలమందు "అగ్గికత్తెర" రోజులలో వేడిమి భరించరానిదిగా ఉంటుంది అనే విషయము అందరికి అనుభవమే. వేడిమిని నియంత్రించే విద్యుత్ ఉపకరణాలు లేని ఆ సమయంలో ప్రకృతిలోని జీవుల బాధను కళ్ళకుకట్టినట్లు చూపించిన కవిత



# అగ్గికత్తెర

సీ॥ చెట్టుపై నోరెండి పిట్టయోపికతప్పి కారాకువలె క్రిందరాలిపడియె
చిత్తడినేలను చేరి కాళులంద్రవ్వి యూరకుక్క పరుండి దోఱుచుండె
పిల్లలపంది అంపిల్లుచు నుడుకెత్తి మురికిగుంటను దిగి గుఱగుఱాడె
తొలంగిన ముకుపుటంబుల పిల్లకాకియు నూతిపళ్ళెపునీట మూతినిడియె
పురుగును కొరికి యూసరవెల్లి నోరెండి కరకర నమలి మ్రింగకయెనుమిసె
బాలకుడు మెల్లగా ప్రాకిప్రాకి, వంట
యింటిలో నీళ్ళబిందెను గెంటి గెంటి
తపతపా రెండుచేతుల తట్టితట్టి
చల్లుకొనె నీటి నొడలెల్ల చల్లపడంగ

సీ॥ ముదుసలి యింటిలో మూల్గుచు వెట్టచే సోలుచు ఆపసోపాలు పడియె
వెట్టకు తట్టుకోవెరచి పెంకులసందులందుండి పిచుకపిల్లలును కూలె
ఆలమందలు నీడయందు మాంగనువెట్టి నెమరులు వెట్టుచు నిలిచియుండె
ఒడలెల్ల ప్రేలి తట్టులుగాంగ పొక్కులు గోకవే, అని తల్లి కూతునడిగె
రే వగల్ తఱచు కరెంటు, పోకకు దంపతులు లోగృహాన నుత్తలముగొనిరి.
కుప్పిగంతుల పిచ్చుక కుమిలికుమిలి
నీరులేని, బకెట్టు పై నిలిచిచూచె
సన్నజాజి లేం దలవాల్చి జాలిగొలిపె
అగ్గికత్తెర దుందుభి నవతరిలగ.



# గ్రీష్మాంతము

(కృష్ణాపత్రిక - 1954 ముద్రితం)

వేసవికాలం తరువాత ప్రకృతిలో జరిగే మార్పుల దృశ్యమును వర్ణించిన కవిత.



# గ్రీష్మాంతము

సీ॥ పందిరివెట్టిన పగిది మింటఁ జరించు
తూనీఁగలకుఁ బెండ్లితొంద రయ్యె
చెదపుర్వులకుఁ గండచీమల కానంద
గమనాతిరేక మగ్గములనయ్యె
పర్జన్యసూక్తముల్ పాటించి పలుకు బో
దుఱుఁగప్పలకును దుందుడుకు హెచ్చె
నెఱియలడాఁగు వన్నెలపాఁప పూఁపల
నడలకు కొంగ్రొత్తయొడుపు కుదిరె
శాద్వలంబను పట్టుసాలువు గప్పికోఁ
గుంభినికొకకోర్కి కొనలుసాఁగె
గగనవల్గనములు చాతకముల కెచ్చె
ఇంద్రగోప పటాటోప మినుమడించె
కడలుకొలిపెను భూసతి కమ్మతావి
చిత్రవృష్టులు పుడమిపైఁ జినుకునపుడు.

సీ॥ పుడమికాఁడంగఁ గవ్వడినాఁటు తూఁపుల
వడువున వడగండ్ల జడులుపడియె
కడుపుమంటల పేదకార్చు కన్నీటిధా
రలునాఁగ వర్ష ధారలును రాలె
ఆణిముత్యాల్ దొర్లినట్లుగాఁ బూరిండ్ల
పెణకలవర్షోదకణములురలె
తేలిపోయెడి గాజు గోళీలు నా వాన
నీట బుద్బుదము లెన్నియొ నటించె
గగనమాగడపలు వెట్టి కాఱుగ్రమ్మె
తరుల నల్లటపఱచు వాతములు ఱేఁగె
సిగలఁ జివురులు తుఱిమి వాసించె లతలు
కువలయంబునఁ దొలికారు గురిసినపుడు

సీ॥ చివికినిట్టూర్చు ప్రోషితభర్తృకనుబోలి
భూకాంత గ్రీష్మోష్మ ఫూత్కరించె
జీవనభారమ్ము చేఁబూని పయనించు
చనుపనాఁ గార్మొగుల్ చదలఁగదలె
ప్రళయతాండవకేళిఁ బలుకు ఢక్కాహుడు
క్కాలునా దివి ఘనగర్జ లురిమె
ఆలికాక్షు దగ్గికన్నులార్చిన విధాన
తొలకరి మెఱుపు లుత్తలము గొనియె
బడుగుఁగడుపులు బంగన బయలుగాఁగ
బీఁటవాఱిన గుండియల్ పెటిలి చిటిలి
మానమున కట్లుపడియున్న కోనలెల్ల
మొనసి తొలివానలకె నీరు మోసికొనియె.

సీ॥ నడివీధిఁబడి బడికుఱ్ఱ డాకుఁ
జెప్పులు వీడి 'రబ్బరుబూటు' దొడిగె
ముక్కాలిముదుసళ్ల బక్కచిక్కిన యంగ
కములు దుప్పటులకై గడగడమనె
'ఐస్ఫ్రూటు' వానిబిట్టఱపులు, బుదుతల
కోలాహలములు సంకుచితమయ్యె
గొంతెండి 'కూల్డ్రింక్సు' గ్రోలఁద్రొక్కిళ్లాడు
నుద్యోగుల 'గిరాకి' యుడిగిపోయె
మూలఁబడెఁ జల్లనీటి కూజాల బ్రతుకు
చేతివీవన లల్లాడ సిగ్గుగొనియె
బయటి ప్రక్కలు నింటిలోపలనెమూల్గె
కడలనిలిచిన గ్రీష్మర్తు కాలమందు.

సీ॥ బంగిలిపల్లి పాపైరాజు గోవా
రసాలు మామిడిపండ్లు సన్నగిల్లె
ఘుమ ఘుమ వాసనల్ గొట్ట గుట్టలుపడ్డ
పనసపండ్ల బెడంగు పలుచఁబడియె
బొగులు రోహిణి రాకపోకల శ్రమగూర్చు
కార్యాల సందడుల్ కడచినడచె
పంజాబుమేలులోఁ బయనించినట్లుగా
వేసవిసెలవుల వేడ్క లెడలె.
"సీట్లు" కఱవైన ఛాత్రు లిస్సీయటంచు
ఆత్మనిందకుఁ బరనింద కందుకొనిరి
చిన్నపల్లెలు చిక్కి 'బస్తీలు' బలిసి
అఱవల 'హెూటళ్ళు' కలకల లాడఁదొడఁగె

# శ్రీరామ రక్ష

ఆమె కలకంఠ కవయిత్రి యయ్యేనేని;
తరుణ కరుణ వసంతగీతమ్మ నేను.
ఆమె వాసించు రేరాణి యయ్యేనేని;
నేను సహకారశాఖినై నిలుతు నచట.

ఆమెయే శరచ్చంద్రిక యైనయెడల;
ఆహరింతు కళానిధి నగుచు నేను.
ఆమె తొలుకాఱుమెఱపు తానయ్యేనేని;
ఉఱుములెఱుఁగపి జలదమై యుందు నేను.

ఆమె పెనుభూతమైనచోఁ; అంధకార
బంధుర దురంత దుర్దాంత భయద గహన
కుహరవిహారజ్జడీభూత ఘూకమునయి
ఇఱికికొందు సంసారంపు టిరులగనుల.

ఆమెయెదఁద అయశ్శిలాకోమలంబు
నాయెడంద పన్నీటి చందనపుఁ గరడు.
ఎంచి వరియించికొన్నార మిరువురమును
ఆమెకును నాకుఁగూడ శ్రీరామరక్ష.

# తుది మాట

మా తండ్రిగారు కీ॥శే॥ శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి గారి అముద్రిత మరియు ఆనాటి వివిధ పత్రికలలో (1930-1960) ప్రచురించబడిన కవితలు, శతకములు, సాహిత్య, వ్యాకరణ విమర్శనా వ్యాసములను సంకలన పరచి పుస్తకముల రూపములో ముద్రించాలి అని ఆయన శత జయంతి సందర్భముగా కుటుంబ సభ్యులందరు నిర్ణయించినారు.

మావద్దలేని ఆయన పుస్తకాలు, ఆయన వ్రాత ప్రతులను సేకరించి సంకలన పరచుటకు దాదాపు ఆరునెలల కాలం పట్టినది. ఈ ప్రచురణ పనిలో ప్రత్యక్ష, పరోక్ష సహకారమును అందించిన స్నేహితులకు, కుటుంబ సభ్యులకు మా ధన్యవాదములు.

నిర్దుష్టముగా డి.టి.పి. చేసి, చక్కని పుస్తకాలను ప్రచురించి ఇచ్చిన దేవి ప్రింటర్స్ సారధి శ్రీమతి చిలకలపూడి శశిరేఖ గారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

పుస్తక సేకరణ, ఇంటర్నెట్‌లో అప్‌లోడ్ చేయుటకు సహకరించిన చిరంజీవి లక్ష్మి సూర్యమనోజ్, చిరంజీవి అనంత్ మరియు చిరంజీవి లాస్యలకు ఆశీర్వచనములతో...

**అడ్రస్ :**
యం.ఐ.జి.ఎ-95
డా॥ ఎ.ఎస్. రావు నగర్,
హైదరాబాద్-500 062.
ఫోన్ : 9494839651

సంకలన కర్తలు
**దువ్వూరి సూర్యభగవానులు**
**దువ్వూరి సుబ్రహ్మణ్యం**

